

రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D

## శాస్త్రిగారి ఇతర రచనలు - ప్రచురణలు

## ముద్రితములు

1. శ్రీ రామకథామృతము - సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్శిటీ వారిచే Ph.D. పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)

   శ్రీలలితాసహస్రనామ వివరణము (అముద్రితము)
9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము ప్రతిపదార్థసహితము
18. శ్రీ త్రికూటేశ్వర త్రిశతి

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ కపోతేశ్వర శతకము



రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

**డా॥ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి**

**M.A.Phd.,**

హక్కులు : రచయితవి
ప్రథమ ముద్రణ : 2002 అషాడ పూర్ణిమ
ప్రతులు : 1000

శివశ్రీ ప్రచురణలు

'అదినీవే' యని తెల్పు "తత్త్వమసి" వాక్యంబందు బహ్మమ్మును
మ్మిది యన్భావముఁదోఁచు, నట్లగుట, నా యీ మాయఁబోఁద్రోచి నీ
పదమున్ జేర్పుము, భక్తవత్సల ! దయాపాంగా ! శుభాంగా ! జయా
స్పద ! చేజెర్ల పురాధివాస ! రిపునాశా ! శ్రీ కపోతేశ్వరా !

రథకారుండు, రథంబు, సారథియు, తద్రథ్యల్ రథాధీశుడున్
రథికుం డశ్వము లాయుధంబులు మహోగ్రంబైన రుద్రత్వమున్
ప్రథితంబౌ ప్రమథాధిపత్యముఁ దలంపన్ రూపవైవిధ్యమౌ
కథలందెల్పు; సమస్తమీవె శుభయోగా ! శ్రీ కపోతేశ్వరా !

ప్రాప్తి స్థానము : టి.యన్. పద్మావతి
భావనారాయణ పేట,
పొన్నూరు - 522 124
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
☎ (08643) 243566.



# లింగాష్టకమ్



బ్రహ్మమురారి సురార్చిత లింగం, నిర్మలభాసిత శోభిత లింగమ్
జన్మజ దుఃఖవినాశక లింగం, తత్ప్రణమామి సదాశివ లింగమ్॥
కామదహన కరుణాకర లింగమ్, దేవముని ప్రవరార్చిత లింగమ్॥
రావణదర్ప వినాశన లింగమ్, తత్ప్రణమామి సదాశివ లింగమ్॥
సర్వసుగంధసులేపిత లింగం, బుద్ధి వివర్ధన కారణ లింగమ్॥
సిద్ధసురాౙ సుర వందిత లింగం, తత్ప్రణమామి సదాశివ లింగమ్॥
కనకమహామణి భూషిత లింగం, ఫణిపతివేష్ఠిత శోభిత లింగమ్॥
దక్ష సుయజ్ఞ వినాశన లింగం, తత్ప్రణమామి సదాశివలింగమ్॥
కుంకుమ చందనలేపిత లింగం, పంకజహార సుశోభిత లింగమ్॥
సంచిత పాపవినాశన లింగం, తత్ప్రణమామి సదాశివ లింగమ్॥
దేవగణార్చిత సేవిత లింగం, భావైర్భక్తిభిరేవ చ లింగమ్॥
దినకర కోటి ప్రభాకర లింగం, సర్వసముద్భవ కారణలింగమ్॥
అష్టదళోపరివేష్టిత లింగం, సర్వసముద్భవ కారణ లింగమ్॥
అష్టదరిద్ర వినాశన లింగం, తత్ప్రణమామి సదాశివ లింగమ్॥
సురగురు సురవర పూజిత లింగం, సురవనపుష్ప సదార్చిత లింగమ్॥
లింగాష్టక మిదం పుణ్యం యః పఠేత్ శివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే

ॐ ఇతి శ్రీ లింగాష్టకమ్॥ ॐ

తనయం దీసకలంబు నీసకలమన్ దానై ప్రకాశించు నె
వ్వని తేజంబున సత్యమాఁడాతడె పరప్రబ్మంబు, సర్వంబు నా
తనిరూపంబుగఁ జూడఁగల్గుట సమత్వంబైన యోగంబు సు
మ్మని నీతత్త్వముఁదెల్పు వేదము; శరణ్యా ! శ్రీ కపోతేశ్వరా !

ఓం అకలంకాయ నమః
” కపర్దినే నమః
” ధరాధరేంద్రనుతభాగ్యాయ నమః
” భవసారాయ నమః
” గిరిధన్వనే నమః
” జయభర్గాయ నమః
” బలధామ్నే నమః
” రిపుభేదినే నమః
” శిపివిష్టాయ నమః
” స్తుతిపాత్రాయ నమః
” శుభ దాత్రే నమః
” హృదయస్థాయ నమః
” అవిభక్తాయ నమః
” ప్రభవిష్ణవే నమః
” శుభయోగాయ నమః
” అఖిలేశాయ నమః
” పరిపూర్ణాయ నమః
” ఘనరూపాయ నమః
” క్రతుభోజినే నమః
” హితభావాయ నమః
” సకలేశాయ నమః
” వృషపర్వాయ నమః
” జయమార్గాయ నమః
” శ్రుతిసారాయ నమః
ఓం అఘనాశాయ నమః
” సాంబాయ నమః
” నుతలీలాయ నమః
” దేవాయ నమః
” వృషభాంకాయ నమః

” ప్రియభక్తాయ నమః
” మహితాత్మనే నమః
” బుధరత్నాయ నమః
” వృషదశ్వాయ నమః
” జితరాగాయ నమః
” అమృతాంశవే నమః
” శుభాంగాయ నమః
” రిపునాశాయ నమః
” త్రిపురారయే నమః
” ప్రణతార్తివారణాయ నమః
” శుభకర్త్రే నమః
” ధ్యేయాయ నమః
” నుతమౌనయే నమః
” అభిరామాయ నమః
” ప్రియదర్శినే నమః
” అనపాయాయ నమః
” స్థిరభావాయ నమః
” నిఖిలవంద్యాయ నమః
” అనిరుద్ధాయ నమః
” జితశత్రవే నమః
” భవనాశనాయ నమః
” విజితాత్మనే నమః
” శివమూర్తయే నమః
” భువనేశాయ నమః
” రససింధవే నమః
” ముని లభ్యాయ నమః
” శ్రీ చేజెర్లపుర నివాసాయ నమః

# శ్రీ కపోతేశ్వర శతకము



శివసంకల్పము, సత్యవాఙ్నియమమున్ శీలంబు, సత్కర్మగౌ
రవ సంపత్సకలంబు నిచ్చు, నిను నారాధింతు మత్పూర్వపు
ణ్య విశేషంబున శంకరా ! సురవరేణ్యా ! పాపముల్ బాపి, యీ
భవబంధం బెడలించి ముక్తినిడు దేవా ! శ్రీ కపోతేశ్వరా !


రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

**డా॥ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి గారు**

M.A.Phd.,

శ్రీ మాత్రే నమః

# పారవశ్యం పలుకులైతే

ఆడితప్పుట దోసమని గదా కొంకక
శిబి మేని కండలు చెండి యిచ్చె

(గయోపాఖ్యాన నాటకం - పంచమాంకం)

చిలకమర్తివారు అర్జునుడి నోటిమీదుగా చెప్పించిన సీస పద్య పాదం ఇది సత్యానికి, ధర్మానికీ మన పూర్వులు, ముఖ్యంగా ప్రజలను పరిపాలించిన రాజులు ఎంతగా కట్టుబడి యున్నారో తెలుస్తున్నది. ఆడి తప్పుట దోసమని ఏ మాత్రం కొంకకుండా, జంకకుండా శిబిచక్రవర్తి తన మేని కండలు చెండియిచ్చాడట. అతడు మూర్తీభవించిన ధర్మదేవత, సత్యవాక్పాలనా దక్షుడు. ఆ కపోతకథే యీనాటికీ మనం మఱచిపోకుండా అప్పుడప్పుడైనా గుర్తుకు తెచ్చుకుంటున్నాం ! అమరులకు భర్త (దేవతాభర్త) ఒకడున్నాడని మన పురాణ వాఙ్మయంచదివితే తెలుస్తుంది. ఈ కథలు చదివితే ఒక్కోసారి “పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటం” అనే సామెత గుర్తుకు వస్తుంది. ఏమైనా ఇటువంటి కథలు చదివినప్పుడు మన ప్రాచీనులు ఎంతగొప్పవాళ్ళో గదా అని మాత్రం మనం అనుకోకుండా ఉండలేం !

ఇదిగో ఈ కపోతేశ్వర శతకం, చదవంగానే నాకు దాదాపు 25 సం॥లు క్రితం ఒకేసారి చేజెర్ల గ్రామంలో దర్శించిన కపోతేశ్వర స్వామి గుడి, ఆ వాతావరణం, ఆపెద్ద మద్ది చెట్టు, ఆ పెద్ద బావి, ఆ చెట్టుకు వేలాడుతున్న పక్షులు ఒక్కసారిగా ఇప్పుడు నా మనఃపథంలో మెదులుతున్నాయి. అసలు నేనూ పల్నాటి వాణ్ణిగావటం మూలాన ఆ ప్రాంతంలో ఉన్న ఏ క్షేత్రాన్ని గురించి ఎవరు, ఏది చెప్పినా నాకెందుకో పట్టరాని ఆనందం గలుగుతుంది.

ఈ శతకకర్త శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు మంచి పద్యకవి, చేయి తిరిగినవాడు. పద్యాన్ని అలవోకగా నడిపించగల సమర్థుడు. ఈ కవి నాకు ఉత్తరం వ్రాస్తూ “మీ ఆశీస్సులు అర్థిస్తున్నానన్నారు. నిజానికి ఈ కవికి అభినందనలు అందించేవాణ్ణేగాని, ఆశీస్సులందించేటంత శక్తి, యోగ్యత నాకు

## శ్రీ కపోతేశ్వర-అష్టోత్తరశతనామావళి

ఓం శ్రీ కపోతేశ్వరాయ నమః
” తాత్రే నమః
” జయభద్రాయ నమః
” బహురూపాయ నమః
” పరశంభవే నమః
” పరమేశాయ నమః
” సురసేవ్యాయ నమః
” గుణసింధవే నమః
” శుభమూర్తయే నమః
” మహిమాఢ్యాయ నమః
” మునివంద్యాయ నమః
” వృషయానాయ నమః
” బుధసేవ్యాయ నమః
” శుభధామ్నే నమః
” బుధవంద్యాయ నమః
” కరుణాశ్రియే నమః
” శ్రిత బంధవే నమః
” హితవర్తినే నమః
” గురుమౌనినే నమః
” స్థిరభావాయ నమః
” సురవంద్యాయ నమః
” జగదీశాయ నమః
” సురపూజ్యాయ నమః
” సుశరణ్యాయ నమః
” జయభావాయ నమః
” చిరకీర్తయే నమః
” సుర రక్షాయ నమః
” సుమన శ్రియే నమః
” శుభగాత్రాయ నమః
” బుధవంద్యాయ నమః
” సుమనస్కాయ నమః
” నుతవిద్యాయ నమః
” శ్రిత రక్షాయ నమః
” శితికంఠాయ నమః
” మునిసేవ్యాయ నమః
” ప్రణవాత్మనే నమః
” నతదేవాయ నమః
” వరదాత్రే నమః
” గిరిజార్థాయ నమః
” జయభద్రాయ నమః
” హృతపాపాయ నమః
” అవికారాయ నమః
” జితమన్యవే నమః
” వరపర్ణినే నమః
” పరశంభవే నమః
” జగదాద్యాయ నమః
” త్రిపురేశాయ నమః
” పరమాణవే నమః
” పరమేష్ఠినే నమః
” త్రిదివేశాయ నమః
” ప్రణవశ్రియే నమః
” వరశూలినే నమః
ఓం ఫణిభూషాయ నమః
” శ్రుతిసారాయ నమః
” కరుణాబ్ధయే నమః

"శ్రీకాళహస్తౌ హి కిరాత నేత్రః
కిరీటి శిబ్యోస్తు" కిరాతగాత్రః
ధ్రువం, కిరాతేశ్వర, ఏవ వాచ్యః,
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్

"ఆదర్శ రమ్యౌ ముఖచంద్రబింబౌ
బింబం గ్రహీతుం వహత స్తవాగ్రే
శ్రీ పార్వతీ చ భ్రమరాంబికా చ
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్

ఓంకారధారా పరమర్షినీతా
నదీ భవంతీ ధరణిం పునంతీ
గంగాధరం త్వామపి సన్నిధత్తే
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

హిరణ్య బహుః సురసైన్య నాథః
త్వాం సేవితుం పుష్పగిరేఃకుమారః,
మహౌషధీభిః స్థితః ఓషధీశ !
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

"స్వయోగ నిద్రాంచ విహాయ విష్ణుః
సహాంజనేయస్తవ దర్శనాయ,
సిద్ధోద్య నిద్రాం విజహాహి, శంభో!
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

"మేఘాల మల్లేశ గుహా గృహాణాం
ఓంకార పీయూష మృజా మృషీణాం,
ఆనంద వర్షీ భవ నీలకంఠః
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

"ఛత్రం వహన్, సూర్య ఫణైః హి, సుబ్ర
హ్మణ్య స్సిషేవే, నిశియద్భవంతమ్
ప్రగే, తథాఽ భ్యర్చయితుం వయం, స్మః
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

– – –

లేవు. అసలు ఈ శతకానికి నన్ను అభిప్రాయం వ్రాయమని కోరడానికి ఒకే కారణం కనిపిస్తున్నది. మా యిలవేల్పు ఈశ్వరుడు. మా వంశంలో చాలా మంది పేర్లు గూడా ఈశ్వర నామాలే ! అక్కిరాజు ఉమాకాంతం, అక్కిరాజు చంద్రమౌళి, అక్కిరాజు మృత్యుంజయుడు అలా మా వంశంలో కనబడ్తాయి. నేను ఈశ్వరుడి పేరెత్తితే పులకరించిపోతాను.

ఈ కపోతేశ్వర శతకం స్థల పురాణం అయినా, మనం ఈ పద్యాలు చదువుత్నుంతసేపూ తెలియని ఓ అవ్యక్తమైన మధురానుభూతిలో తేలిపోతాం ! ఇది ఎక్కడ జరిగిన కథైనా కావచ్చు, మనకు ఆ స్థలం కన్నా, కవిగారు ఈశ్వరుణ్ణి స్తుతించేవైనం, ఆ సంబోధనలు, విశేషాలు మనలను ముగ్ధుల్ని చేస్తాయి. కవికి శైవ వాఙ్మయం మీద కేవలం మక్కువ మాత్రమేగాదు, సంపూర్ణమైన అధికారం వున్నట్లు ద్యోతకమవుతుంది. ముఖ్యంగా ప్రతిపద్యంలో చివరిపాదంలో శ్రీ కపోతేశ్వరా, అనే మకుటపదానికి ముందుగా వాడిన 'య' గణాలుగాని, లేక 'త' గణాలు గానీ పరిశీలించి చూస్తే పరమేశ్వరునికి ఈ కవివాడిన సంబోధనలు, పలితలకు ఒక అద్భుతమైన పరవశాన్ని కలిగింప జేస్తాయి. ఆ పదాలు గతంలో మహాకవులు ఎంతోమంది అనేక చోట్ల ప్రయోగించినవే అయినా ఈ కవి ప్రయోగించిన తీరు చాలా ఔచితీవంతంగా కనిపిస్తుంది. జయభద్రా, పరశంభూ, బహురూపా, వర శంభూ, సురసేవ్యా, గుణసింధూ, శుభమూర్తీ, మహిమాఢ్యా, వృషయానా, బుధసేవ్యా, కరుణాశ్రీ, శ్రితబంధూ, హితవర్తీ, గురుమౌనీ, స్థిరభావా – ఇలా చెప్పుకుంటూపోతే ఈ సంబోధనలు ఈ ప్రదేశాల్లో ఎందుకు వాడారో పద్యం మొత్తం చదివినప్పుడు అర్థమౌతుంది. మొట్టమొదటి పద్యంలోనే 'స్థలపురాణం'గా పేర్కొంటూ చెప్పిన పద్యం హృద్యం.

కరుణాంతఃకరుణుండునాన్ శిబి పరీక్షంజేయ, నింద్రాగ్నులన్
సురలే పావురమౌచు, డేగ యగుచున్ జూపట్టి, రందాది, మున్
శరణంచున్ దనుఁజేర వచ్చిన ప్రదేశంబిద్ది చేజెర్లయై
వరలెన్, ఱేడు ప్రతిష్ఠఁజేసె నిను, దేవా ! శ్రీ కపోతేశ్వరా !

ఈ కవి రచించిన శ్రీ కపోతేశ్వర శతకం, నిస్సంశయంగా పదికాలాల పాటు వెలిగే రచన, ఇతనికి యింతటి శక్తి ఎలా గలిగిందా అని ఆలోచిస్తే చివరి చివరి పాద్యలలో తేట తెల్లమవుతుంది. జీవితంలో ఎవరికైనా, కవిసార్వ భౌముడు శ్రీనాథుడు చెప్పినట్లు మంచి గురువు దొరకాలి ! శాస్త్రం అనేది మంచి ఆచార్యుడి దగ్గర చదువుకోవాలి. అటువంటప్పుడు ఇకవారి జీవితం ధన్యం గణ్యం కాకుండా వుంటుందా? ఆంధ్రదేశంలో పరమపూజ్యులు మహా పండితులు, మహానిష్ఠాగరిష్ఠులు కీ॥శే॥ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారిని ఎఱుగనివారుండరు. అటువంటి మహనీయుల ఆశీశ్సులుండడం వల్లనే శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారికి యింత పాండిత్యం, శక్తి లభించాయనేది గూడా నా నిశ్చితమైన అభిప్రాయం.

ఈ శతకంలో శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు స్థలపురాణము, అభ్యర్థనము, పౌరాణిక కథాకథనము, స్వరూపవర్ణనము, మహిమాను వర్ణనము, మహేశ్వరుని విశ్వేశ్వరత్వము, ఉపాసనా విధానము, ఆత్మ నివేదనము, లోకవృత్తము అనే శీర్షికలనుంచి పద్య రచన చేశారు. ఇదొక విభిన్నమైన రచనా లక్షణము. ఈ శతకంలో మహాకవి ధూర్జటి కవితా ఛాయలున్నప్పటికీ ఒక ప్రత్యేకతగూడా కనబడుతున్నది. ముఖ్యంగా కొన్ని పద్యాలు చదువంగానే నా బోటివాడు గొంతెత్తకుండా ఉండలేక పోతున్నాడు. అదిగో అటువంటి కోవలోనిదీ పద్యం.

రవి చంద్రానల లోచనా ! రసమాయా ! రాజత్కృపాసాగరా !
భవతాపజ్వరహారి ! ముక్తి పదసౌభాగ్య ప్రదాతా ! మహో
త్సవసంధాయక ! పుణ్య పాప ఫలదా ! సారస్వతాధీశ ! చూ
డవె ! చేజెర్ల పురాధివాస ! శితికంఠా ! శ్రీ కపోతేశ్వరా !

శివుణ్ణి "సారస్వతాధీశ" అనడం ఎంతోబావుంది. ఈ కవి దక్షిణామూర్తిగాఁ బట్టి, మంచి పేరు మేధ కలవాడుగాఁ బట్టి అలా అనగలిగారు అలాగే.



# కపోతేశ్వర స్వామి సుప్రభాతమ్


బ్ర.వే. మేళ్ళచెర్వు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు M.A
సంస్కృత రీడర్,
ఓరియంటల్ కళాశాల,
తిమ్మసముద్రం


"హే విశ్వ సుప్రజశ్శంభో !
పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉతిష్ఠ సుర శార్దూల !
కర్తవం, విశ్వరక్షణమ్"

సహస్రలింగేశ్వర ! జీవలింగ
త్రయీ వృతాఖండగురు ప్రదీప !
చేజర్ల దీపద్రుమమేరుదీప !
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

త్వం, షోడశారాబ్జ కళాప్రపూర్ణః
ఏకాదశస్థ ద్విదళాబ్జ చక్రః,
తతశ్చ షట్చక్ర శిరస్థ హంస ః
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

త్వం ద్వాదశాంతాప్త ఫలైక భోగ ః
న, వృక్ష మిచ్ఛస్యసృగస్థి సారమ్
'అనామవృక్షః, తవతత్వమాహ
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

త్వం ప్రాణలింగః గజపృష్ఠ రంగః
చతుర్భుజాధార గృహప్రతిష్ఠః
శూన్య ద్వయీసూచిత మూల, పీఠః
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

"సారూప్య మోక్షం శిబయే దిశన్, త్వం
సారూప్య మేతేన భజస్యుదారః
తద్దాన కీర్త్యంక కిణాంక లింగః
స్వామిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

"సత్యం నయో యస్య విలోచనాభౌ
"అహం స, సోఽ హంన్వితి" సూచనాయ,
శివైక్య శిబ్యైక్య కథామనాటీః
స్వానిన్ ! కపోతేశ్వర ! సుప్రభాతమ్"

ఇది ధ్యానం బిది యోగ మియ్యది తపం, బీ తత్త్వమే జప్య మి
య్యదియే వేద్య, మిదే పవిత్రము, రహస్యంబిద్ది, జ్ఞానమ్ము సు
మ్మిది ధ్యేయమ్ము, సమాశ్రయమ్ము, సకలశ్రేయమ్ములన్ గూర్చుని
య్యదె, చేజెర్ల పురాధివాస ! యనపాయా ! శ్రీ కపోతేశ్వరా ! 120

నదులున్ సాగర గాము లౌచుఁ గదియాన్గా, నామరూపంబులున్
దుదిఁగోల్పోయి సముద్రమై వినుతిఁబొందున్, జీవులధ్యాత్మ యో
గ దశన్ బ్రహ్మమె యౌచు నాత్మదురహంకారాదులన్ వీడుటొ
ప్పదె ? చేజెర్ల పురాధివాస ! స్థిరభావా ! శ్రీ కపోతేశ్వరా ! 121

ధనధాన్య ప్రముఖాష్టసంపదలతో దైన్యంబు లేనట్టి జీ
వన, మాయాసములేని మృత్యువు భవత్ పాదాంబుజధ్యాన సే
వన సౌభాగ్యము నిచ్చి నిత్యమగు నావాసంబు కైలాసమి
మ్మని, నిన్వేఁడెద, శంకరా ! విబుధవంద్యా ! శ్రీ కపోతేశ్వరా ! 122

తన యత్యుత్కట పుణ్యపాపఫలముల్ తధ్యంబులైవచ్చు, జీ
వున కయ్యర్థమవశ్యభోక్తమిట, సంపూర్ణంబు దివ్యంబు నీ
యనుకంపన్ బడయంగఁజాలు సుకృతుండానందమందున్ బ్రకీ
ర్తన; చేజెర్ల పురాధివాస ! యనిరుద్ధా ! శ్రీ కపోతేశ్వరా ! 123

వ్యవసాయాత్మికమైన బుద్ధి, యదిచేయంగోరు కార్యంబు, దా
ని విశిష్టంబగు సౌఖ్యదుఃఖము లొగిన్ నీరూపభేదంబులే,
శివశక్త్యాత్మకమైన నీ తనువు సంసేవ్యంబు భక్తాళికిన్
ధ్రువ ! చేజెర్ల పురాధివాస ! జిత శత్రూ ! శ్రీ కపోతేశ్వరా ! 124

అవతారంబు లవెన్నిలేవు మఱిసన్యాసిన్ ననున్ గావ, రా
ఘువనారాయణశాస్త్రి మూర్తివయి సత్కారుణ్య దాక్షిణ్యవా
ర్ధివినై శ్రీయును మేధఁగూర్చి యనురక్తిన్ దక్షిణామూర్తిగా
స్తవయోగ్యత్వమునిచ్చినా బ్రతుకులో సార్థక్యమున్ నింపు నీ,
యవతారం బవతారమయ్య ! నీకు నతులయ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 125



అభిషేకం బొనరించి, వస్త్రమిడి, నానాలంకృతుల్ జేర్చి, సౌ
రభ మౌగంధము, పత్ర పుష్పఫలనీరం బన్నమున్ గూర్చి, మా
కభయంబీయఁగ రుద్రనామముల నిన్నర్చింతు నీరాజన
ప్రభ ! చేజెర్ల పురాధివాస ! స్తుతిపాత్రా ! శ్రీ కపోతేశ్వరా !

పరమ ప్రీతి భజింతు నీ పదములన్ భద్రా ! భవానీపతీ !
పరమార్థ ప్రతిపాదకా ! ప్రణవరూపా ! శ్రీ మహాదేవ ! దు
స్తర సంసార సముద్ర సంతరణ విద్యా వైభవా ! సత్కృపా
కర ! చేజెర్ల పురాధివాస ! శ్రితరక్షా ! శ్రీ కపోతేశ్వరా !

ఇట్లే కవిగారు చివరలో అనుబంధం పేర కొన్ని పద్యాలు రచించారు. ఆ పద్యాలలో శివుడు దివ్యమహిమానుతత్త్వం, యోగవైశిష్ట్యం, సర్వజ్ఞత్వం కనబడతాయి.

అణిమంబున్ మహిమంబునీవ, లఘిమంబట్లే గురుత్వంబునున్
గుణమున్ నిర్గుణమీవ – శాంతమతియున్ఁగ్రోధస్వభావంబు, ర
క్షణమున్ శిక్షణ, మాదియున్ దుదియు, సంకల్పంబు తన్నాశకా
రణమీవే, ప్రణవార్తివారణ సమర్థా ! శ్రీ కపోతేశ్వరా !

పరమేశ్వరానుభూతిలో కవిపొందిన పారవశ్యం ఈ శతకమైతే ఈ శతకంలోని భక్తి కవితామాధుర్యానికి నేను పొందిన పారవశ్యమే ఈ పలుకులు. శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు ఆంధ్రదేశానికి కొత్త వారేమీ గాదు. గతంలో ఆయన రచించిన శతకాలు, కావ్యాలు పండిత పామరులను అలరించినవే ! పరమేశ్వరుణ్ణి గురించి ఇంత అద్భుతంగా రచించిన ఈ కపోతేశ్వర కర్తగారిని, నా అభీష్టదైవం అయిన అమ్మవారిని గురించి గూడా ఒక శతకం వ్రాయ వలసిందిగా కోరుకుంటూ ఆ జగజ్జనని, నా ఉపాస్య దేవత శ్రీ రాజరాజేశ్వరి ఈ కవిగారికి ఆయురారోగ్యైశ్వర్యాలు ప్రసాదించాలని కోరుకుంటూ సెలవు.

భవదీయుడు

**డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణ**

## శతరుద్రీయము

"ఆర్ష విద్యాసాగర" "సాహితీ బృహస్పతి"

మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి, M.A.

"భవాన్ మృత్యుంజయో దేవః శూలపాణి స్త్రిలోచనః।

పాదాహతస్త్వయా మృత్యుః కామఃనేత్రాగ్నినా హతః॥

అని బ్రహ్మేంద్రాది దేవతలు నిత్యమూ పరమశివుణ్ణి స్తోత్రం చేస్తూ ఉంటారట. ఇది వ్యాసమహర్షి చెప్పిన పురాణ సాక్ష్యం. యముణ్ణి కాలితో తన్ని తరిమి వేయడం, మన్మధుణ్ణి ఫాలనేత్రాగ్నితో భస్మం చేయడం పరమేశ్వరుని ఘనకార్యాలుగా దేవతలు కీర్తిస్తున్నారు. ఎందుకో ?

యముడు 'మృత్యు'దేవత. ప్రాణుల ఆయువు తీరిపోగానే వచ్చి వారి ప్రాణాలను హరించే, వారికి మృత్యుస్వరూపుడైన యముణ్ణి జయించాడు శివుడు తన భక్తుడైన మార్కండేయుణ్ణి రక్షించే సందర్భంలో శివుడు తన ఎడమకాలితో యముణ్ణి తన్ని తరిమినట్లు పురాణగాథలు చెప్తున్నాయి. అలాగే తపోదీక్షలో ఉన్న తనను కవ్వించి, కదిలించి, కరిగించాలని ఇంద్రుడు పంపగా వచ్చిన మన్మధుణ్ణి, తన మూడవ కంటి మంటతో మసిచేశాడు పరమేశ్వరుడని పురాణ కథల్లో వింటున్నాం. మన్మధుడు 'కామ' స్వరూపుడు, యముడు 'కాల' స్వరూపుడు. కామజయము, కాలజయము పరమేశ్వరునికే సాధ్యం. కామం సృష్టికి మూలం. కాలం మృత్యువుకు ఆధారం. కాముణ్ణి మసిచేయడం అంటే జన్మలేకుండా చేయడం. కాలుణ్ణి తరిమివేయడం అంటే మృత్యువును అధిగమించడమే, చావుపుట్టుకలను జయించడం అంటే మోక్ష సామ్రాజ్యాన్ని కైవసం చేసికోవడమే. జనన మరణ రూపమైన సంసార సాగరం నుండి ఆవలితీరమైన మోక్షానికి చేర్చగలవాడు కాముణ్ణి, కాలుణ్ణి జయించినవాడు పరమేశ్వరుడొక్కటే. యముణ్ణి తన్ని తరిమివేడయం, మన్మధుణ్ణి మసిచేయడం అనే ఈ రెండూ చాలా గొప్ప విషయాలుగా దేవతలు భావించి ఉంటారు.

మోక్షప్రదాత అయిన పరమేశ్వరుణ్ణి ప్రార్థించి, సేవించి, తరించిన వారు ఎందరో ఉన్నారు. వివిధ యుగాలవారు ఆ స్వామిని అర్చించి

## అనుబంధము

అణిమంబున్ మహిమంబు నీవ, లఘిమంబట్లే గురుత్వంబునున్
గుణమున్ నిర్గుణమీవ, శాంతమతియున్ గ్రోధస్వభావంబు, ర
క్షణమున్ శిక్షణ, మాదియున్ దుదియు, సంకల్పంబు తన్నాశకా
రణమీవే, ప్రణతార్తివారణ సమర్థా ! శ్రీ కపోతేశ్వరా ! 114

ఘనులై యా శిబి మాంసమున్ గవచ మాకర్ణుండు, జీమూత వా
హనుఁడున్ జీవము, లా దధీచి యెముకల్ త్యాగంబుఁ గావించి ర
ర్థి, నదేయంబెదియౌ మహాత్ములకు ? సద్గేయంబు తన్నార్గవ
ర్తన, చేజెర్ల పురాధివాస ! శుభకర్తా ! శ్రీ కపోతేశ్వరా ! 115

కనులన్ గాంచితి నీదు విగ్రహము, మ్రొక్కంగంటి నీపాదముల్
వినఁగానైతిని నీదునామ జపమున్, విజ్ఞాన సంపత్ప్రదా
యినియౌ నీకృపఁగంటి, నిజ్జగము నందెల్లన్ బ్రపూర్ణుండవౌ
టను భావించితి నీ ప్రసాదమున; ధ్యేయా ! శ్రీ కపోతేశ్వరా ! 116

విషమాక్షుండవె యైన భక్తులను సంవీక్షింతు వెల్లప్పుడున్
విషకంఠుండవె యైన వాక్సుధలు సంప్రీతిన్ బ్రసాదింతు, వా
విషనాగుల్మెయిఁదాల్చి నిర్విషయ సంవేద్యుండవై, రోగక
ల్మషముల్ మాన్పి విముక్తిఁగూర్తు వభిరామా ! శ్రీ కపోతేశ్వరా ! 117

వలపుల్ వడ్డికిఁబార జంటలయి సంబంధంబుఁబాటించుచున్
బులుగుల్ పుల్లలు చేర్చి గూడొకటి నేర్పుల్ మీఱ, నిర్మించి, పి
ల్లల కాహారమొసంగి సాకుటది యెల్లన్ జీవ సామాన్య వ
త్సలతన్ దెల్పు; విశేషమా విధి విలాసంబో కపోతేశ్వరా ! 118

మది భేదంబొదవంగ ఖేదమగు, సమ్మానింప మోదంబగున్
హృదయంబందు విమర్శఁజేసి కనఁగా నెందైన బ్రహ్మంబు కా
నిది లేదీ జగమందు, సత్య, మదియే నీవంచు నే భక్తిఁగో
ల్చెద,ఁ చేజెర్ల పురాధివాస ! ప్రియదర్శీ ! శ్రీ కపోతేశ్వరా ! 119

దురహంకారులు, దుష్టబుద్ధులు, పరద్రోహైక చింతాపరుల్
పరపీడాపరు లాత్మవంచకులు దుర్వ్యామోహ గర్వాంధులై
నరరూపంబునఁదోఁచు రాక్షసులుగా నర్తింప, వీక్షింతువే ?
వర చేజెర్ల పురాధివాస ! పృషదశ్వా ! శ్రీ కపోతేశ్వరా ! 108

అనురాగంబును, ద్వేషమున్ బ్రబలమైనంతన్, బ్రమాదంబు పు
ట్టు, నిరీహన్ సమబుద్ధితో మెలఁగు చుండున్, యోగి సంఘంబు, స
జ్జన వర్గంబు భవత్సమాశ్రయమునన్, జ్ఞానంబు వైరాగ్యమున్
గను; చేజెర్ల పురాధివాస ! జితరాగా ! శ్రీ కపోతేశ్వరా ! 109

జనులాదిత్యుని రాకపోకలను సోత్సాహంబుగాఁ జూచి, నె
మ్మన మానందము నంద మందమతి సంభావింప రాయుక్షయం
బును నిత్యంబు; జగత్ప్రభుండ వగు నిన్ బుద్ధిం బ్రతిష్ఠించి కొ
ల్చిన మృత్యుంజయు లౌదు రర్మిలిఁ ద్రిశూలీ ! శ్రీ కపోతేశ్వరా ! 110

తన మర్యాదయె పోయెనంచుఁ గడుసంతాపంబునన్గుందు నా
మనుజుండయ్యది యిచ్చి పుచ్చుకొను సంబంధంబుగా నెంచునో ?
"తనవోలెన్ గద లోకము"న్న పటుశాస్త్రంబున్ బ్రమాణీకరిం
చునొ ? చేజెర్ల పురాధివాస ! అమృతాంశూ ! శ్రీ కపోతేశ్వరా ! 111

చితి నిర్జీవముఁ గాల్చు జింత తనువున్ జీవంబుతోఁ గాల్చు, సం
తతమున్ జింతల పుల్చు చావగ మన స్థైర్యంబు లోపించు, స
మ్మతి, శాన్తిన్, నిను మానసంబునఁ దలంపన్ జాలు ధన్యుండు, స
ద్గతిఁజెందున్, సుఖభోగ సంపద; శుభాంగా ! శ్రీ కపోతేశ్వరా ! 112

గుణ కర్మంబులు జీవ భేదము లొగిన్ గుర్తింపఁగాఁ జేయు, స
ద్గుణ సంపన్నుఁడు నీ యనుగ్రహముఁ బొందున్, లోక సేవాపరా
యణుఁడై మన్ననలందు; దుష్క్రియలచే వ్యాఘాతమున్ గూర్చు ని
ర్ఘృణుఁడెందున్ గరుణాల వాల ! త్రిపురారీ ! శ్రీ కపోతేశ్వరా ! 113



ఆనందించారు. మనదేశంలో ద్వాదశజ్యోతిర్లింగ క్షేత్రాలలో ఆ స్వామి కొలువు తీరినవైనం ప్రసిద్ధం. కలియుగ మానవులను తరింపచేసేందుకు కరుణా సముద్రుడైన పరమేశ్వరుడు అన్ని దేశాల్లో అన్ని కాలాల్లో అవతరిస్తూనే ఉంటాడు. ఆంధ్రదేశంలో గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా 'చేజెర్ల' గ్రామం అలాంటి శైవ క్షేత్రాల్లో ఒకటిగా ప్రసిద్ధికెక్కింది.

తన్ను శరణు వేడిన పావురాన్ని రక్షించడానికి, డేగకు తన మాంసాన్నే కోసి ఇచ్చిన శిబిచక్రవర్తి త్యాగధనుడు, ఆ మహనీయుణ్ణి పావురం శరణు వేడిన పవిత్ర ప్రదేశం "కపోత కందర పురం"గా ప్రశస్తి చెందిందని, అక్కడి శివాలయంలో స్వామికి కపోతేశ్వరుడని వ్యవహారం వచ్చిందని స్థలపురాణం చెప్తోంది. క్రీ।।శ।। 4వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని పాలించిన ఆంధ్రరాజులు ఆనందగోత్రికులు "కపోత కందర పురాన్నే" తమ రాజధానిగా చేసుకున్నారు. ఆ వంశ ప్రభువు 'కందరాజు' శిథిలావస్థలో ఉన్న కపోతేశ్వరాలయాన్ని పునర్నిర్మించినట్లు చరిత్ర వివరిస్తోంది. పౌరాణిక ప్రాశస్త్యము, చారిత్రక వైశిష్ట్యము గల 'కపోతకందర పురమే' నేటి "చేజెర్ల". ఆ గ్రామంలో కపోతేశ్వర రూపంలో అర్చామూర్తిగా అవతరించిన పరమశివుణ్ణి దర్శించి పొందిన దివ్యానుభూతిలో కవి హృదయం ఆలపించిన "శతరుద్రీయం" ఈ శతకం.

ఈ శతక కర్త – మాన్య మిత్రులు డా।। తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు పద్య రచనలో పరిణత ప్రజ్ఞా ధురీణులు. విద్యార్థి దశలో వీరిలో అంకురించిన కవితా బీజం మహావృక్షమై, శాఖోప శాఖలుగా విస్తరించింది. పావనీ శతకం, భావదేశ శతకం, సత్యనారాయణ శతకం, వీరాంజనేయ శతకం మొదలైన మధుర ఫలాలను పండించింది. ఆ కోవలో శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు వెలువరించిన మరోరచన "శ్రీ కపోతేశ్వర శతకం". సామాన్యులనూ ధీమాన్యులనూ సమానంగా అలరింపచేసే సాహిత్య ప్రక్రియ శతకం. హృదయ నందనంలో విరబూసే భక్తిపారిజాతాలను పరమాత్ముని పాదాలకు సమర్పించడానికి అనువైన అక్షరోపాయనం శతకం.

శాస్త్రిగారు ఈ శతకంలో ప్రతి పద్యంలోనూ తన హృదయంలోని భక్తిని మృదుమధురంగా వెల్లడించారు. అచంచల విశ్వాసం భక్తికి మూలం. అలాంటి విశ్వాసంతోనే సృష్టి స్థితి సంహారాలు పరమశివుని అధీనంలోనే సాగు తున్నాయని శాస్త్రిగారు కీర్తించారు. వేద వాఙ్మయం పట్ల గౌరవం, కావ్య శాస్త్రాలతో ప్రగాఢ పరిచయం ఆధారంగా తూములూరు వారు శివతత్త్వాన్ని గురించి చక్కని అవగాహనను ఈ శతకం ద్వారా అందిస్తున్నారు. "అసతోమా సద్గమయ ! తమసోమా జ్యోతిర్గమయ!! మృత్యోర్మా అమృతం గమయ !!!" అని ఉపనిషత్తులు దైవాన్ని ప్రార్థించాయి. ఆ భావాన్ని నేపథ్యంగా గ్రహించి "తమముం బాపి వెలుంగు జూపుము మహాత్మా ! మృత్యువుంద్రోచి నా కమృతత్వంబిడుమా ! యసత్యమును బాయంచేసి సత్యమ్ము గూర్పుము" అని పరమేశ్వరునికి తమ అభ్యర్థనను నివేదిస్తున్నారు కవి. "యదాదిత్యగతం తేజోజగద్భాసయతేఽ ఖిలమ్। యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమా మకమ్॥" అని గీతాచార్యుడు ప్రబోధించగా, "రవి తేజంబున నుండు తీక్ష్ణతయు, చంద్రజ్యోత్స్న యందుండు శైత్య విశేషంబును నీ ప్రభావమె" అని శాస్త్రిగారు శివుణ్ణి ప్రస్తుతిస్తున్నారు.

సర్వేంద్రియాలనూ సర్వేశ్వరసేవలో సార్థకం చేసికోవడం భక్తికి జీవలక్షణం. శాస్త్రిగారు ఏమంటున్నారో చూడండి. "నిను దర్శించుట కంటికిన్ ఫలము, నిన్ గీర్తించుటే వాక్కుకల్గిన దానన్ ఫలితంబు, నిన్ దలచుటే క్లేశాపహంబో మహాత్మ ! నినున్ గొల్చుటె కాలుసేతులకు సార్థక్యంబు" అని సర్వసమర్పణ భావాన్ని సర్వాంగ సుందరంగా వ్యక్తీకరిస్తునారు.

పరమేశ్వర తత్త్వం వర్ణించడానికి వాక్కునకు ఊహించడానికి మనస్సునకు అందేది కాదన్న భావనతో"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అని ఉపనిషత్తులు వ్యాఖ్యానించాయి. "సనాతనమైన శాశ్వతమైన నీ మహిమమత్యంత ప్రభావంబు కల్గినదై మాటలకున్ మనంబునకు విశ్లేషింపగా రానిదై మనున్...." అని శతకకర్త వివరిస్తున్నారు.

విజయారోగ్యములిచ్చి, శత్రుతమమున్ భేదించి, నీ పాదపం
కజసేవా పరతంత్రమానస మొసంగన్ గోరు, నన్నాత్మలో
స్వజనంబంచుఁ దలంచి, కూర్మి నెఱపన్ బ్రార్థింతు, భస్మీకృతాం
గజ ! చేజెర్ల పురాధివాస ! వృషభాంకా ! శ్రీ కపోతేశ్వరా ! 102

"అమరుం డాశ్రితవత్సలుండగు విరూపాక్షుండు, జ్ఞాన ప్రదా
త, మృడుం డాతఁడు మోక్షమిచ్చు" నని వేదంబుల్ ప్రబోధింపఁగాఁ
గ్రమముందప్పక భక్తి నీకు నభిషేకం, బర్చనల్ గూర్చి మ్రొ
క్కమె, చేజెర్ల పురాధివాస ! ప్రియభక్తా ! శ్రీ కపోతేశ్వరా ! 103

ఇది శక్యమ్మొ, యశక్యమో, యెఱుఁగ, స్వామీ ! నిన్నుఁ బ్రార్థించెదన్
సదయాపాంగములన్ నిగిడ్చి భయసంసక్తున్ ననున్ గావవే,
హృదయంబందు, భవత్పదాంబుజము లర్థిన్ జేర్చి, భక్తిన్ భజిం
చెద, చేజెర్ల పురాధివాస ! పరమేష్ఠీ ! శ్రీ కపోతేశ్వరా ! 104

తనువున్ బ్రాణము లాత్మయున్ జగము త్వద్భావంబె; భావింప సా
ధనమున్ సాధ్యము సాధకుండనెడు సత్యంబున్ నిరూపించు, భో
జనమున్ భోక్తయు భుక్తిదుండు త్రిపుటిన్ సర్వంబు నీవే; సనా
తన ! చేజెర్ల పురాధివాస ! మహితాత్మా ! శ్రీ కపోతేశ్వరా ! 105

## లోకవృత్తము

పురుషాహంకృతి విఱ్ఱవీగఁ దగునే మూర్ఖంబుగా నేటికిన్
నిరపాయంబగు భక్తి మార్గమున సందేహంబులన్ వీడి, నీ
చరణంబుల్, శరణంబువేఁడిన మనశ్శాంతిం బ్రసాదింతు వీ
శ్వర ! చేజెర్ల పురాధివాస ! కలినాశా ! శ్రీ కపోతేశ్వరా ! 106

తృటిలో మోదము ఖేదమున్ భయము సందేహంబు మోహంబు నం
తటిలోఁగామముఁగ్రోధమున్ మదము మాత్సర్యంబు లోభంబు నెం
తటి వారిన్ గదలించు, గాల మహిమన్ దాటంగరాదో మహా
నట ! చేజెర్ల పురాధివాస ! బుధరత్నా ! శ్రీ కపోతేశ్వరా ! 107

ప్రణయంబున్, బ్రళయంబు నీవలననే, ప్రారంభమై యంతమౌఁ
దృణమున్ మేరు నగంబుగాఁ బెనుచు నీదివ్యత్వ మత్యద్భుతం
బణు మాత్రంబు భవత్కృపాఽ మృతము నాకందింపు, మాపన్నివా
రణ ! చేజెర్ల పురాధివాస ! శ్రుతిసారా ! శ్రీ కపోతేశ్వరా ! 96

అపరాధంబుల నెన్ని చేసితినొ, నేనజ్ఞానినై మున్ను, నీ
దు పదారాధకులైన [1]మద్గురుల సద్యోగంబునన్, సత్య ధ
ర్మ పథంబున్ దరిసించి, గమ్యమును జేరన్, నన్ను మన్నింపు వి
శ్వప, చేజెర్ల పురాధివాస ! యఘనాశా ! శ్రీ కపోతేశ్వరా ! 97

అవమానంబులఁగ్రుంగుచున్ బ్రతుకు హేయంబై కృశింపన్, భవా
ర్ణవ మధ్యంబున గ్రాహమోహముల నిర్బంధంబు పాలౌ, వివే
క విహీనుండ, దయార్ద్ర బుద్ధివయి నన్గాపాడ రావే, క్షమిం
పవె, చేజెర్ల పురాధివాస ! శివ ! సాంబా ! శ్రీ కపోతేశ్వరా ! 98

తొలి జన్మంబునఁజేయు కర్మఫలముల్, తోడ్తోఁ బ్రవర్తించు, జీ
వులకున్ గల్గెడు సౌఖ్యదుఃఖములు తన్మూలంబులై యుండు, ని
చ్చలు మానం బవమానమున్, గుణము దోషంబున్ బ్రసక్తంబగున్
లలి; చేజెర్ల పురాధివాస ! నుతలీలా ! శ్రీ కపోతేశ్వరా ! 99

ప్రతిభాసంపద లేదు కావ్యరచనా వ్యాసంగమున్ బూన, సం
తత మభ్యాసము లోకశాస్త్రములు సందర్శించు వ్యుత్పత్తి సం
గతియున్ లేదు రసోచితంబగు నలంకార ధ్వనిప్రాభవో
న్నతి, చేజెర్ల పురాధివాస ! సుశరణ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 100

అజుఁడున్ శాశ్వతుఁ డవ్యయుండు , వరదుం డాద్యంత శూన్యుండు, పూ
ర్వజుఁ డానంద మయుం డనంత విభవ బ్రాజుండు, పూజ్యుండుగా
నిజతేజోమహిమంబునన్ జగము సందీపింపఁగాఁ జేయుచున్
బ్రజలన్ గాచు ప్రభుండ వీవె; మునిలభ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 101



1 బ్ర.వే. తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు (చందోలు)

జీవులందరూ శివునిలోని అంశమేనని, నదీనాం సాగరోగతిః అన్నట్లు సృష్టిలోని సమస్త శబ్దార్థాలూ పరమశివునికి పర్యాయాలేనని, ప్రణవాత్మ స్వరూపుడు కపోతేశ్వరుడని కవి పొందిన దర్శనం ఈ శతకంలో గోచరిస్తోంది.

సృష్టికంతటికీ శివుడే ఆధారమని, రాతిలోని కప్ప, గర్భస్థశిశువు కూడా శివానుగ్రహంతోనే జీవించ గలుగుతున్నారని, బ్రహ్మాండవర్తనమంతా ఆ స్వామి లీలా విశేషమేనని శివమహిమాను వర్ణనంలో కవి వివరిస్తున్నారు. “శిలలోఁగప్పయు గర్భమందు శిశువున్ జీవింపగాజేయు నీవలనన్ సాధ్యము కాని దెద్ది…” అని కపోతేశ్వరుణ్ణి ప్రశ్నిస్తున్నారు. అసలు సృష్టి అంతా ఈశ్వరస్వరూపం తప్ప వేఱేమీ కాదన్న నిశ్చల భక్తితో “అణురూపంబు మహత్వభావమును, నీవై యుంటివో విశ్వకారణ” అని శివుణ్ణి కీర్తిస్తున్నారు. అంతేగాక, “పశుపక్ష్యాది సమస్త జీవతతులన్ బ్రాణంబవై నిల్చి కర్కశ పాషాణ విషాణ ముఖ్య జడిమన్ గాఢిన్యమై పొల్చి, నల్దిశలున్ పల్దశలున్ భవద్వశముగా దీపించునని అతని విశ్వేశ్వరత్వాన్ని విశదం చేస్తున్నారు.

సాధనమార్గంలో ముందుకు సాగుతున్న భక్తునికి, తన దేహమే దేవాలయమని, జీవుడే సనాతనుడైన దైవమని అనుభూతి కలుగుతుంది. ఈ సత్యాన్నే మన సంప్రదాయం కూడా వివరించింది. “త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోఽ హం భావేన పూజయేత్” అని మార్గదర్శనం చేసింది. “భగవత్తేజము దేహమందు కొలువై భాసింప దేవాలయంబగు, జీవుండె సనాతనుండయిన దైవాంశంబుగా శాస్త్రపారగు లజ్ఞాన నిధానమై చెలగు నిర్మాల్యంబు పోద్రోతు రిమ్ముల..... అనే పద్యం ఈ అనుభూతికి అక్షరరూపమే.

“యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి” అని గీతాచార్యుడు ప్రబోధించాడు. భక్తుడు దైవాన్ని అంతటా అన్నింటిలోను దర్శిస్తాడు. అంతటినీ, అన్నింటినీ దైవంలో దర్శిస్తాడు. ఈ విధమైన స్థితి భక్తికి పరాకాష్ఠ. అందుకు కావలసిన దృష్టిని ప్రసాదించమనే నిజమైన భక్తుడు దైవానికి నివేదించు కుంటాడు. అలాంటి నివేదన ఈ శతకంలో కన్పిస్తుంది.

"నిను నాలోఁగనలేనినాడమరునే నిక్కంబు విజ్ఞానమున్, నిను నే గా గమనింపకున్న కలదే? నిర్ద్వంద్వ, మద్వైతమున్, నినులోకంబుల నంతటన్ గనుగొనన్ దృష్టిం బ్రసాదింపుము" అని కవి చేసిన అభ్యర్థన భక్తులందఱూ చేయవసిన అసలైన ప్రార్థన.

ఇష్టదైవం పట్ల గల ప్రీతి ఇనుమడించిన కొద్దీ ఆ భక్తునికి దైవంతో సాన్నిహిత్యం పెరుగుతుంది. ఆ పాదాలను ఆశ్రయించినంతనే ఫలితం సిద్ధిస్తుందని, వావిడిచి వరాలు కోరుకోవలసిన అవసరం లేదని స్పష్టమవుతుంది.

"వరమిమ్మంచును వేఱె కోరవలెనా ? భద్రమ్ములన్ గూర్చు నీ
చరణంబుల్ శరణంబు వేఁడ, శుభముల్ సర్వంబు సిద్ధించు, నా
త్మరహస్యం బఖిలంబు బోధపడు, తత్త్వజ్ఞాన మబ్బున్"
అని కవి చేసిన ఉద్ఘాటన ఇందుకు సాక్ష్యం.

ఐహిక సంపదలెన్ని ఉన్నా, లౌకిక భోగాలెన్ని లభించినా, మనశ్శాంతి లేనిదే జీవుని వేదనాగ్ని చల్లారదు. శివస్మరణమే మనశ్శాంతికి మంచి మార్గం అంటున్నారీ శతక కర్త.

"చిత నిర్జీవము గాల్చు, చింత తనువున్ జీవంబుతోగాల్చు, సంత
తమున్ చింతల పుల్పు చావగ మనస్థైర్యంబు లోపించు,
సమ్మతి శాంతిన్, నిను మానసంబున దలంపన్‌జాలు ధన్యుండు
సద్గతి జెందున్ సుఖభోగ సంపద....." అనే పద్యంలో.

ఈశ్వరుడు త్రినేత్రుడు కనుక దృష్టి విషమం కావాలి. కాని కారుణ్యైక దృష్టితో భక్త జనులను కాపాడే మహనీయుడాతడు. శివుని కంఠంలో భయంకరమైన కాలకూటం దాగి ఉంది. అయినా. తీయని, చల్లని మాటలతో తన భక్తులను అనుగ్రహించి, వారికి మృత్యుంజయత్వం కూడా ప్రసాదిస్తాడు మహేశ్వరుడు. బాహ్యస్వరూపానికీ అంతర స్వభావానికీ ఈశ్వరునిలో గల ఈ వైవిధ్యాన్ని కవి చక్కగా ఆవిష్కరిస్తున్నాడు. ఈ పద్యంలో చూడండి !

క్షణికోద్రేకమునన్ బ్రవర్తిలెడు నే క్షంతవ్యుఁడన్, దేవ ! ఘ
ర్షణపాలైతిఁబ్రశాంతిఁగోలుపడితిన్, రారాపులన్ ద్రోచి, ర
క్షణఁగల్పించి, భవత్సమాశ్రితుఁడ, నన్గాపాడవే, నాగభూ
షణ ! చేజెర్ల పురాధివాస ! సకలేశా ! శ్రీ కపోతేశ్వరా ! 90

కలిదోషాహత చిత్తులై కపటులై కార్పణ్యబుద్ధిన్ బ్రవ
ర్తిలు గర్వాంధుల సంహరించు, నినుఁబ్రార్థింతున్, మహాదేవ సా
ధుల రక్షింపఁగ నుద్యమింతువని సద్యోజాత రూపా ! మహా
బల ! చేజెర్ల పురాధివాస ! "వృషపర్వా" ! శ్రీ కపోతేశ్వరా ! 91

తిమిరంబెల్లఁ దెమల్చి, తేజమెద నుద్దీపించు, దేవాది దే
వ ! మహాదేవ ! సమస్త జీవహృదయావాసుండవైనట్టి ని
న్ను, మహామాయ నివృత్తిఁజేయఁ బ్రణుతింతున్ నన్ను సంప్రీతిఁగా
వుము; చేజెర్ల పురాధివాస ! నిరతంబున్, శ్రీ కపోతేశ్వరా ! 92

సిరులున్, శ్రేయములిచ్చి కాచు, కరుణాసింధున్ ద్రినేత్రున్, నినున్
దిరమౌ భక్తి భజింతు నెంతయు, విభూతిన్ దుష్టిఁ బుష్టిం గనన్
బరమార్థంబవు బ్రహ్మమున్ బడయు, తత్త్వజ్ఞాన మిమ్మో పరా
త్పర ! చేజెర్ల పురాధివాస ! సురసేవ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 93

మలినంబున్, మదమత్సరప్రవణమున్ మర్యాదహీనంబు సం
చలితం, బాత్మ వివేక శూన్యము మనస్సంపాతమున్ మాన్పి, వ్యా
కులతం దీర్చి, త్వదంఘి సేవనము నాకున్ గూర్పు, సంప్రీతి సం
ధిల; చేజెర్ల పురాధివాస ! కరుణాబ్ధీ ! శ్రీ కపోతేశ్వరా ! 94

గుణవద్వస్తువుఁజేరి, యన్యమును సౌగుణ్యంబు సాధించు ల
క్షణ మొప్పన్, గుసుమంబులన్ గలిసి, సూక్ష్మంబైన సూత్రంబుఁద
ద్గుణమున్ జెందదె ? సర్వభూతహితు, నిన్గొల్తున్ బ్రపన్నార్తి వా
రణ ! చేజెర్ల పురాధివాస ! జయమార్గా ! శ్రీ కపోతేశ్వరా ! 95

శయనంబున్, బయనంబు, ధావనము, తిష్టద్, జాగ్రదత్తాసనా
ది, యనంతక్రియలాచరించు ఘన శక్తిన్, గీర్తనీయుండవై,
జయ, మానందము నిచ్చు చేతనత, విశ్వంబెల్ల వ్యాపించు, చి
న్మయ ! చేజెర్ల పురాధివాస ! పరిపూర్ణా ! శ్రీ కపోతేశ్వరా ! 84

## ఆత్మ నివేదనము

శరణార్థిన్ దయఁజూడవే నను, మహేశానా ! హరా ! సోమశే
ఖర ! గంగాధర ! శంకరా ! భవహరా ! కైవల్య సారా ! శుభం
కర ! భక్తాఘహరా ! శివా ! స్మరహరా ! కళ్యాణ సంపత్కరా !
వర ! చేజెర్ల పురాధివాస ! ఘనరూపా ! శ్రీ కపోతేశ్వరా ! 85

పదముల్ పట్టి నమస్కరింతుఁ గరణాపాథోధివై, నన్ను నీ
సదనంబున్ గదియంగఁ జూడుము భవత్సాయుజ్యమున్ గూర్చి, దీ
న దయాళుండవు నీవు, భక్తజన సన్తాపంబులన్ ద్రోచి, ప్రో
చెదు, చేజెర్ల పురాధివాస ! క్రతుభోజీ ! శ్రీ కపోతేశ్వరా ! 86

వరమిమ్మంచును వేఱె కోరవలెనా ? భద్రమ్ములన్ గూర్చు నీ
చరణంబుల్ శరణంబువేఁడ, శుభముల్ సర్వంబు సిద్ధించు, నా
త్మరహస్యం బఖిలంబు బోధపడుఁ దత్త్వజ్ఞాన మబ్బున్, సురే
శ్వర ! చేజెర్ల పురాధివాస ! భవనాశా ! శ్రీ కపోతేశ్వరా ! 87

అరయంగా 'శివునాజ్ఞలేని యెడఁ జీమైనన్ బ్రవర్తింపదం'
దురె, స్వామీ ! భరియింపఁజాలని మహాదుఃఖంబుఁబ్రాప్తించె, నీ
కరుణాలోకనముల్ నిగిడ్చి, సరగన్ గాపాడ రావే మహే
శ్వర ! చేజెర్ల పురాధివాస ! భువనేశా ! శ్రీ కపోతేశ్వరా ! 88

గ్రహముల్ తొమ్మిది, నీయనుగ్రహము నాకాంక్షించుచుండున్, దురా
గ్రహులై రక్కసు లీజగంబుఁబరిమార్పంజూచువేళన్, మహా
మహిమన్ వారి వధించి, లోకహితమున్ బాటింతు వీశా ! జయా
వహా ! చేజెర్ల పురాధివాస ! హితభావా ! శ్రీ కపోతేశ్వరా ! 89



విషమాక్షుండవె యైన భక్తులను సంవీక్షింతు వెల్లప్పుడున్
విషకంఠుండవె యైన వాక్సుధలు సంప్రీతిన్ బ్రసాదింతు వా
విషనాగుల్ మెయిదాల్చి నిర్విషయ సంవేద్యుండవై రోగ క
ల్మషముల్ మాన్పి విముక్తి గూర్తు వభిరామా ! శ్రీ కపోతేశ్వరా !

ఇలా సాగిపోయే కవితా స్రవంతిలోని సౌందర్య మాధుర్యాలను గూర్చి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. మధ్యలో ఒక "శార్దూలం" గర్జించినా, శంతకంలోని పద్యాలన్నీ మత్తేభాలే. మంద గమనంలోని హుందాతనాన్ని పుణికి పుచ్చుకొని ధారాశుద్ధి సంశోభితంగా నడక సాగించాయి. సంస్కృతాంధ్రపదాల సామరస్యం శాస్త్రిగారి సమాస ఘటనా సామర్థ్యానికి ప్రతీకగా నిలిచింది. ఏపద్యం ఎత్తుగడ అందుకున్నా చివరి వఱకు హాయిగా ఆర్తితో ఆలపింపచేసేదే. ప్రదిపద్యంలోనూ "శ్రీకపోతేశ్వరా" అనే మకుటానకి ముందున్న సంబోధనలు సార్థక విశేషణాలై "అలంకార సౌందర్యానికి" "పరికరాలు" గా అమరుతున్నాయి. ఈ సంబోధనలన్నీ కపోతేశ్వరునికి అష్టోత్తర శతనామావళిలో ఒదిగిపోయి చరితార్థమయ్యాయి.

ఈ కవిదైవాన్ని కోరిన కోరిక నాకు చాలా నచ్చింది. మానవులందరూ కోరుకోదగిన కోరిక ఇదే. "ధనధాన్య ప్రముఖాష్ట సంపదలతో దైన్యంబు లేనట్టి జీవన మాయాసములేని మృత్యువు, భవత్ పాదాంబుజ ధ్యాన సేవన సౌభాగ్యము నిచ్చి, నిత్యమగు నావాసంబు కైలాసమిమ్మని నిన్వేడెద శంకరా ! ....." అంటున్నారు కవి.

శ్రీ కపోతేశ్వర స్వామి కవిగారికి అభీష్టసిద్ధిని అనుగ్రహించాలని నిండుమనస్సుతో ఆకాంక్షిస్తూ............. **సెలవు.**

కవిః కరోతి కావ్యాని, రసంజానాతి పండితః!
తరుః సృజతి పుష్పాణి, మరుద్వహాతి సౌరభమ్॥

## ఆశీస్సులు

"శిబి చేతి తక్కెడ సిబ్బుల వలె మేను
లిరువంక నెలవంక నెలమినిలుప
నయము ధర్మము వోలె స్వయముగా ద్వంద్వ మై
తరతమత్వములేక తఱచి నిలువ
ఉరుహింస విరమించి యూరు హింసకు వచ్చి
యోడి గెలిచిన లీవి యుట్టి పడగ
సురపక్ష పాతియై "సురపక్షి" పాతియై
సమపక్షియగు 'హంస' సౌరు చెలగ.

తే॥ అర్ధనారీశ్వరుండు సవ్యాప సవ్య
పక్ష పరిపూర్ణ రక్షణ శిక్షణుండు
నైకపోతేశ్వరుఁడు కపోతేశ్వరుండు
ఈక యోటుఁబోవు నీకిచ్చు ! నీఁక 'యొకటి"

(2)

"అవతారంబులు వేనవేలు గలవయ్యా ! దక్షిణామూర్తి ! రా
ఘవనారాయణ శాస్త్రి తీర్థు లయి సాక్షాదక్షి యుగ్మంబునన్
బవలున్ రేలును 'శక్తుఁడై'మనలఁగాపాడెన్ శ్రవశ్చక్షులన్
అవునా ? అందుకె "సోఽహ" మంచు నిటులన్ ప్రాణాహుతుల్ పొందుటల్'

(3)

"భవుడు గురుండు, శక్తి గురుపత్ని యిదే గురుమండలం బదే
యవనిక వీడియీ యవని కందిన దట్టి యదృష్టవృష్టిలోఁ
గువకువలాడు చాతకపు కూనల మైతిమి మండుటెండలే
యవి, యొక లెక్కయా ? కవనమందు నదీధరు కౌగిలింపవే"

జననంబాదిగ శోకమోహములతో స్వాంతంబు, భ్రాంతంబుగాఁ
గ, నికృష్టంబవు సంసృతిన్ మునిఁగి, లోకంబెల్ల వాపోవుటం
గని, సత్సంగతి, యోగి సంతసము, మోక్షం బిచ్చు నిన్గొల్చు సా
ధన; చేజెర్ల పురాధివాస ! శుభదాతా ! శ్రీ కపోతేశ్వరా ! 78

బలిమిన్ బ్రాణము లుగ్గఁబట్టి, కనులన్ బంధించి, సద్బ్రహ్మచ
ర్యలఁబాటించి, యుపాసముండియు, శరీరాయాసముల్ లేక, ని
స్థలపోయంగల యోగమే కవిత; త్వద్గానంబె యాగం బచం
చల ! చేజెర్ల పురాధివాస ! హృదయస్థా ! శ్రీ కపోతేశ్వరా ! 79

అనునిత్యంబు సభక్తికంబుగ మహాన్యాసంబుఁగావించుచోఁ
గనులున్, నాసికయున్, లలాటము, బొమల్, కర్ణంబులున్, గంఠమున్
దనువున్ బ్రాణము లాత్మ, పాదములు, హస్తంబుల్ భవద్భావమున్
గను; చేజెర్ల పురాధివాస ! యవిభక్తా ! శ్రీ కపోతేశ్వరా ! 80

అతఁడే నేనని, నే నతండనుచు 'సోఽహం హంస భావంబునన్
సతమున్ వర్తిలుచున్ సమాహితమతిన్ సాధించు సద్యోగి సం
తత దుఃఖంబులు వీడి, కర్మఫల సంత్యాగంబుఁగావించు స
న్నుతి; చేజెర్ల పురాధివాస ! ప్రభవిష్ణూ ! శ్రీ కపోతేశ్వరా ! 81

నిను నాలోఁగనలేనినాఁ డమరునే ? నిక్కంబు విజ్ఞానమున్,
నిను నేఁగా గమనింపకున్న కలదే ? నిర్ద్వంద్వ, మద్వైతమున్,
నినులోకంబుల నంతటం గనుఁగొనన్ దృష్టిన్ బ్రసాదింపు మ
ర్థిని, చేజెర్ల పురాధివాస ! శివమూర్తీ ! శ్రీ కపోతేశ్వరా ! 82

హరియంచున్ హరుఁడంచు, నా హరిహరుండంచున్ విభాగించి, స్త్రీ
పురుషుండంచు, విభేదముల్ గఱపి, సంమోహంబుఁ బుట్టించి, రొ
క్కరె, నిక్కంబుగ, నామరూపములు సంకల్పంబులే సర్వ, మీ
శ్వర ! చేజెర్ల పురాధివాస ! యఖిలేశా ! శ్రీ కపోతేశ్వరా ! 83

## ఉపాసనా విధానము

భగవత్తేజము దేహమందుకొలువై భాసింప దేవాలయం
బగు, జీవుండె సనాతనుండయిన దైవాంశంబుగా, శాస్త్రపా
రగు లజ్ఞాన నిధానమై చెలఁగు నిర్మాల్యంబుఁ బ్రోఁదోతురి
మ్ముల, చేజెర్ల పురాధివాస ! సతతంబున్ ! శ్రీ కపోతేశ్వరా ! 72

జపమున్ స్తోత్రము, ధ్యానమున్, దపము, యజ్ఞంబుల్, వ్రతంబుల్, పరం
తప ! నీ సన్నిధిఁజేరు మార్గములె, శాన్తంబైన నీ రూపమెం
దుపమింపన్ సరిలేదు; నిన్దెలియు సద్యోగంబు నిమ్మో గణా
ధిప ! చేజెర్ల పురాధివాస ! రిపుభేదీ ! శ్రీ కపోతేశ్వరా ! 73

పరమానందకరంబు నీ స్మరణ, మవ్యాజంబు నీప్రేమ, మి
ర్వుర మన్యోన్య మపేక్షతో మెలఁగఁ బర్వుం శాశ్వతానందమున్
చిరకాలమ్మొక కొమ్మపై నిలుచు పక్షిద్వంద్వమై యుంటి మీ
శ్వర ! చేజెర్ల పురాధివాస ! శిపివిష్టా ! శ్రీ కపోతేశ్వరా ! 74

'అపరిచ్ఛేద్యుఁడు విశ్వరూపుఁడు, శివుండానంద ధాముండునా
నుపదేశించు శ్రుతిప్రమాణముల సంయోజింప, భాసింపదే
యపవర్గ ప్రదమైన నీమహిమ, సాంబా ! చేదుకోరాదె ? స
త్కృప; చేజెర్ల పురాధివాస ! హితవర్తీ ! శ్రీ కపోతేశ్వరా ! 75

అభిషేకం బొనరించి, వస్త్రమిడి, నానాలంకృతుల్ జేర్చి ! సౌ
రభమౌ గంధము, పత్ర పుష్ప ఫల నీరం బన్నమున్ గూర్చి, మా
కభయం బీయఁగ రుద్రనామముల నిన్నర్చింతు నీరాజన
ప్రభ; చేజెర్ల పురాధివాస ! స్తుతి పాత్రా ! శ్రీ కపోతేశ్వరా ! 76

పరమ ప్రీతి భజింతు నీ పదములన్ భద్రా ! భవానీపతీ !
పరమార్థప్రతిపాదకా ! ప్రణవరూపా ! శ్రీమహాదేవ ! దు
స్తర సంసార సముద్ర సంతరణ విద్యా వైభవా ! సత్కృపా
కర ! చేజెర్ల పురాధివాస ! శ్రితరక్షా ! శ్రీ కపోతేశ్వరా ! 77



(4)

ఇంగువ వంటి దా గురుని యింగిత మందునఁ బడ్డ వారికిన్
"సంగపుతావి" దక్కుట యసంభవమా ? మఱి యందు చేతనే
యంగజవైరిభక్తి రసమబ్బెను, పొమ్మని యన్న బోదురా,
హంగుగ నీకు నిద్దె యిటు లాజన శాంతము తూములూరెడిన్"

(5)

"గురునాశీర్వచనంబు, బాల దయయున్ గొండాడు నీయందు సం
బరమై యంబరమంటుచున్ కవిత, సన్మార్గంబుగా వచ్చె, న
ద్దిర ! నా దీవెన యేల నయ్య ! యమృతాబ్ధిన్ నీటి చుక్కేగదా !
హరుఁడే నీకు మనోహరుండగుత సర్వానర్థ సంహారుడై"

**బ.వే. మేళ్ళచెర్వు సుబ్రహ్మణ్యశాస్త్రి,** M.A
సంస్కృత రీడర్, ఓరియంటల్ కళాశాల, తిమ్మసముద్రము

## శివనామస్మరణము

కరమున జ్ఞానముద్రయు, ముఖంబున జానగు మౌనముద్ర, యాం
తరమున యోగనిద్రకలనన్, వటమూలమునన్ వసించుచున్,
స్థిరమతి, శాంతిఁగూర్చు, శశిశేఖరునిన్, భవరోగవైద్యునిన్
గురువులకెల్ల సద్గురువుఁగొల్తు మహాత్ముని దక్షిణాస్యునిన్

శ్లో॥ కర్తా కారయితాచైవ ప్రేక్షకశ్చానుమోదకః।
సుకృతం, దుష్కృతంచైవ, చత్వారస్సమభాగినః॥

ఈ కృతికి కారకులైన సుకృతులను కొందఱిని స్మరించటం ఇచట నాకర్తవ్యము మాన్య మిత్రులు శ్రీ దొడ్లేటి సత్యనారాయణగారు, వారి కుమారుడు D.V.L.N శేషగిరిరావుతో కలిసి మేము సకుటుంబంగా గుంటూరు జిల్లా, నరసరావుపేట సమీపంలో ఉన్న చేజెర్ల వెళ్ళి అక్కడ వేంచేసియున్న

శ్రీభ్రమరాంబా సహితుఁడైన శ్రీ కపోతేశ్వర స్వామిని సందర్శించి వచ్చాము. వారు, ఆ దేవాలయాభివృద్ధి సమితి సభ్యులు కావటంచేత, నాతో 'మా స్వామిని గూర్చి ఒక శతకం వ్రాయండి' అని చెప్పి, వారి మనసులోని కోరిక వెల్లడించారు. అంతట నేను

నిను దర్శించితి పూర్వపుణ్యమహిమన్ నీ దివ్యచారిత్ర మె
ల్లను గీర్తింతును జన్మ సార్థకముగా లక్ష్యంబు సిద్ధింప నీ
వనుమోదింపుము, సాహితీ సహృదయాహ్లాదంబు సంధిల్లఁ జి
ద్ఘన ! గంగాధర ! భ్రామరీ రమణ ! త్రాతా ! శ్రీ కపోతేశ్వరా !

అని ఆనాడు సంకల్పించి కొన్నానేకాని, నాకున్న ఇతర వ్యాపకముల వలన వ్రాయలేకపోయాను - 2001 సం॥లో శివరాత్రి పర్వదినాన మఱల మహానందిలో కలిసినప్పుడు శ్రీ సత్యనారాయణగారు ఆ విషయం గుర్తుచేసి, శతకం పూర్తి చేయమన్నారు.

పాపాన్ని పోగొట్టి, మోక్షాన్ని ప్రసాదించే 'శివనామస్మరణము' సకల శుభములను చేకూర్చుననే విశ్వాసంతో శ్రీ కపోతేశ్వర శతకము పూర్తి చేసి, గడిచిన విజయదశమినాడు బ్ర.వే. మల్లాప్రగడ శ్రీరంగారావు గారికి వినిపించాను. వారు వాత్సల్యంతో నన్ను ఆశీర్వదించి ప్రోత్సహించారు. వారి కుమారులు, నాకు ప్రియమిత్రులు, సాహితీ సహవ్రతులు అయిన శ్రీమన్నారాయణమూర్తిగారిని ముందుమాట వ్రాయమని అడిగితే వారు నాపైగల అభిమానంతో 'శతరుద్రీయమను' పీఠిక వ్రాయడమే గాక శ్రీయుతులు అక్కిరాజు సుందరరామకృష్ణగారి చేత కూడా వ్రాయిస్తే బాగుంటుందని చెప్పి, వారికి పరిచయం చేస్తూ ఉత్తరం వ్రాశారు. శ్రీ అక్కిరాజువారు శతకం చదివి 'పారవశ్యం పలుకులైతే' అంటూ తమ ఆమోదాన్ని తెలియఁజేశారు. శ్రీసుందర రామకృష్ణగారి అమూల్యమైన అభిప్రాయం ఈ శతకానికి వన్నె తెచ్చిందని నా ప్రగాఢ విశ్వాసం.

రథ మందున్ బయనించుచో మనుజుఁడారాటంబుతో వెంటఁ దె
చ్చు ధురన్, దాని శిరంబునందిడి భరించున్ భారవాహుండువో
లె, ధృతిన్ లోకముఁదాల్చు నిన్దెలియఁగా లేనట్టి, యజ్ఞానికిన్
వ్యథయే తోఁచు, ధరాధరేంద్రనుతభాగ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 66

క్షణ మందేమి ఘటిల్లునో ? యెఱుఁగఁడొక్కండున్ ! బ్రపంచంబులో
నణువైనం గదలింపఁజాలఁడెది, నీయాదేశమున్‌లేక, ర
క్షణ మెట్లేర్పడు, నీయనుగ్రహముతక్కన్ సర్వలోకప్రసా
రణ ! చేజెర్ల పురాధివాస ! భవసారా ! శ్రీ కపోతేశ్వరా ! 67

వనముల్, వృక్షములున్, సుమంబులు, ఫలవ్రాతంబుఁ, దద్గంధసా
ర నిరూఢిన్ విలసిల్లు, సౌఖ్యమయ సారస్యంబు సర్వంబు, నీ
వను భావంబు మనంబునన్ దిరముగా, నర్చింతు రక్షింపవే !
నను, చేజెర్ల పురాధివాస ! గిరిధన్వా ! శ్రీ కపోతేశ్వరా ! 68

సవనవ్రాతము, ఋత్విజ ప్రకరమున్ సంస్కార కర్మంబులున్
స్తవముల్ వైదిక మంత్రతంత్రములు, సూక్తంబుల్ మహావాక్యముల్
స్రువముల్ స్రుక్కులు, నగ్నిహోత్రములు నీరూపంబులీశా ! మయో
భువ ! చేజెర్ల పురాధివాస ! పరశంభూ ! శ్రీ కపోతేశ్వరా ! 69

మణిమంత్రౌషధముల్ భవన్మహిమచే మాన్యంబులై, సౌఖ్యధా
రణమౌ సంపద లిచ్చు, సంతసముఁ బర్వంజేయు, సత్కర్మకా
రణమై పొల్చు, శుభంబులన్ బెనుచు, శర్వా ! యాశ్రితాతంకవా
రణ ! చేజెర్ల పురాధివాస ! జయభర్గా ! శ్రీ కపోతేశ్వరా ! 70

బ్రతుకున్, వృత్తులు, తత్ప్రవృత్తులుఁ, బ్రకర్షంగల్గు నావ్యక్తు, లా
తతవిద్యావిషయంబు, లుద్ధతియు శాంతం, బంశమున్ బూర్ణమున్
పతనం బున్నతి, పూర్వమున్ బరము, సర్వంబీవ కావే ? మహా
మతి ! చేజెర్ల పురాధివాస ! విజితాత్మా ! శ్రీ కపోతేశ్వరా ! 71

సికతా, స్రోతములున్, సరోవరములున్, సీమంబులున్, ద్వీపముల్
సకలాశావలయంబు, మేఘములు, వర్షం, బాతపం, బూష్మ, మూ
ర్మికలున్, వాయు జలాగ్ని భూ సభము లర్థిన్, నీదురూపంబు లే
లిక, చేజెర్ల పురాధివాస ! వరశూలీ ! శ్రీ కపోతేశ్వరా ! 60

పరమోత్కృష్టపదుండవై భువనముల్ పాలించు నీ శక్తి, ను
ర్వర నెవ్వండెఱుఁగున్, ద్వదీయ, మవికల్పంబైన సంకల్పమే,
పఱఁగున్ సృష్టిసమస్తమున్, బ్రతిఘటింపన్ జాలు వారెవ్వరీ
శ్వర ! చేజెర్ల పురాధివాస ! ఫణిభూషా ! శ్రీ కపోతేశ్వరా ! 61

అణిమాద్యష్ట విభూతి నీశ్వరపదం బార్జించి, లోకంబులన్
ప్రణుతింపన్‌బడు ముఖ్యదైవతము నిన్భావింతు భావంబునం,
దణురూపంబు, మహత్స్వభావమును, నీవైయుంటి, వో విశ్వకా
రణ ! చేజెర్ల పురాధివాస ! శ్రుతిసారా ! శ్రీ కపోతేశ్వరా ! 62

నిను వేదంబుల సారమంచు నభివర్ణించున్ బురాణావళుల్
మునులాత్మానుభవంబునన్ గనుచు సంమోదింతు రంతర్ముఖుల్
జను లాశ్చర్యముతో భవన్మహిమమున్ జర్చించి, యర్చింతు ర
ర్థిని చేజెర్ల పురాధివాస ! కరుణాబ్ధీ ! శ్రీ కపోతేశ్వరా ! 63

అనుమానాది బహుప్రమాణములు, నీయాథార్థ్యమున్ బోధఁజే
యను, నిక్కంబుగ నేరఁజాలవన, సాధ్యంబౌనె, నాబోఁటి కెం
దును, వేదాంతములైన, యా యుపనిషత్తుల్ చెప్ప, బ్రహ్మంబుఁగా
గను, చేజెర్ల పురాధివాస ! యకలంకా ! శ్రీ కపోతేశ్వరా ! 64

పశుపక్ష్యాది సమస్తజీవతతులన్ బ్రాణంబవై నిల్చి, క
ర్కశ పాషాణ, విషాణ ముఖ్య జడిమన్ గాలిన్యమై పొల్చి, న
ల్దిశలున్ పల్దశలున్ భవద్వశముగా దీపించు, నిన్నే, యహ
ర్నిశమున్‌గొల్చెద, మోక్ష సిద్ధికి, కపర్దీ ! శ్రీ కపోతేశ్వరా ! 65



బ్ర.వే. మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆ కపోతేశ్వర సుప్రభాతం వ్రాసి శతకానికి పరిపూర్ణత కల్పించి, ప్రేమతో నన్ను ఛందోవాక్కులతో ఆశీర్వదించారు. నా సహోద్యోగులు శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యంగారు నా యీ ప్రయత్నమును జూచి మనస్ఫూర్తిగా అభినందిచారు.

ఆర్థిక సహకారాన్ని అందించి, ఈ శతకముద్రణకు తోడ్పడిన వదాన్యులు, శ్రీ నీలిశెట్టి నరసింహారావుగారు, శ్రీ సత్యనారాయణగారు.

నేను ఈ శతకం యొక్క వ్రాతపతిని చూచి, సరిచేసి తగు సూచన లీయమని ఇవ్వగా నాయందు వారికి గల అవ్యాజాభిమానంతో ఇందులోని ప్రతి పద్యం చదివి, ప్రత్యక్షరం దిద్ది తగిన సూచనలిచ్చి, పుస్తకానికి అందం తెచ్చిపెట్టినవారు మన్మిత్రులు, రిటైర్డ్ సీనియరు తెలుగు పండితులు అయిన శ్రీ జొన్నలగడ్డ జానకి రామయ్యగారు ఇంతియేగాక వీరు తమ అభిమాన పూర్వకమైన అమూల్యాభిప్రాయమును కూడా హృద్యమైన ఒక పద్యములో ఈవిధంగా తెలియచేశారు.

చూచుచునుంటి మిత్రవర ! చూడకయుందునె నీవు చెప్పఁగా
వాచవులూరు పద్యములు వాకున కందని భావముల్ సుధా
వీచులఁదూఁగు శయ్యలును వీనుల విందొనరించు శైలియున్
జూచినఁజోద్యమయ్యెడిని, సూరి వరేణ్యుఁడ ! యెట్లు నేర్చితో

వీరందఱికి నా వందన మందారాలను అందఁజేస్తున్నాను. తనపై కృతి వ్రాయించుకొని నన్ను సుకృతినిఁజేసిన శ్రీ కపోతేశ్వరునకు భక్తి వినమ్రతలతో నమస్కృతులు సమర్పిస్తున్నాను.

తనుచేయందొరకొన్న మంచిచెడులన్ దత్కర్తయున్ గారకుం
డనుమోదించుచు, బ్రోత్సహించుచును బ్రత్యక్షంబుగా జూచుచుం
డినవారల్ సమభాగులై ఫలము నిర్ణీతంబుగా నందుటల్
సను; చేజెర్ల పురాధివాస ! యఘనాశా ! శ్రీ కపోతేశ్వరా !

**తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి**

శ్రీ శివాయగురవే నమః

# శ్రీ కపోతేశ్వర శతకము

## స్థల పురాణము

'కరుణాంతః కరణుండు' నాన్, శిబిఁ బరీక్షంజేయ, నింద్రాగ్నులన్
సురలే, పావురమౌచు, డేగ యగుచున్ జూపట్టి, రందాది, మున్
శరణంచున్ దనుఁజేర వచ్చిన ప్రదేశంబిద్ది చేజెర్లయై
వరలెన్, ఱేఁడు ప్రతిష్ఠఁజేసె నిను, దేవా! శ్రీకపోతేశ్వరా! 1

### అభ్యర్థనము

నిను దర్శించితిఁబూర్వ పుణ్యమహిమన్, నీదివ్య చారిత్రమె
ల్లను గీర్తించెద జన్మసార్థకముగా, లక్ష్యంబు సిద్ధింప, నీ
వనుమోదింపుము సాహితీ సహృదయాహ్లాదంబు సంధిల్ల ! జి
ఘ్నన ! గంగాధర ! భ్రామరీ రమణ ! త్రాతా ! శ్రీ కపోతేశ్వరా 2

భావాతీతుఁడవై, భవాబ్ధిఁదరియింపన్ నౌకవై, సృష్టికిన్
జీవాధారుఁడవై, జగత్త్రయము రక్షింపన్ సమర్థుండవై
సేవింపన్ శివలింగ రూపమున వాసిన్గాంచు, నిన్గొల్తు, నా
ర్యావామాంగ ! విభూ ! శుభంబొసఁగు మయ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 3

భవ మద్రంకరుఁడైన శంకరుని నిన్భావించు భాగ్యంబు నీ
యవె, జన్మాంతము దాఁక నీకుఁ బరిచర్యం జేయు దాస్యంబు, పా
ప వినాశంబగు నీదు నామము జపింపన్ భక్తియోగంబుఁ గూ
ర్పవె, చేజెర్ల పురాధివాస ! జయభద్రా! శ్రీ కపోతేశ్వరా ! 4

జగదుత్పత్తియు, రక్షణ క్రమముఁ దత్సంహారమున్ దేవ ! నీ
దగు సంకల్పము చేతనే కలుగుఁ దథ్యంబంచు బోధించు, నా
నిగమంబుల్, సకలంబు నీవె యగుటన్ నిత్యంబుఁ బ్రార్థింతుఁ బ్రో
వగ; చేజెర్ల పురాధివాస ! బహురూపా ! శ్రీ కపోతేశ్వరా ! 5



పవలున్ రేలును, భక్తితో నిను మదిన్భావింప, సద్భోగ, భా
గ్య విశేషంబులుఁగల్గుఁ, జిత్త మకలంకంబై ప్రశాంతిన్గనున్
శివముల్ దోఁచును గష్టముల్ దొలఁగు, వాసింగాంచు, సౌఖ్యంబుఁదో
డవు, చేజెర్ల పురాధివాస ! జగదాద్యా ! శ్రీ కపోతేశ్వరా ! 54

పురుషార్థంబులు నాలుగున్ గలుగు, సంమోదం బెసంగున్, నిరం
తర మాత్మన్ భజియించు భక్తుల, కనంతా ! మున్ను బ్రహ్మాదులే
యరయన్ జాలరు నిన్ను, సద్వినయ విద్యాబుద్ధు లందింపు, మీ
శ్వర ! చేజెర్ల పురాధివాస ! త్రిపురేశా ! శ్రీ కపోతేశ్వరా ! 55

జగదాశ్చర్యకరంబు నీమహిమ, మీశా ! భక్తి వర్ణించు, నా
నిగమం, బౌపనిషద్ విశేషములు నీ నిర్ఛిద్ర భద్రాకృతిన్,
వగ మాన్పన్, బగఁదీర్ప, నా కభయమున్ బ్రాప్తింపఁ, బ్రార్థింతు, మా
నుగ, చేజెర్ల పురాధివాస ! పరమాణూ ! శ్రీ కపోతేశ్వరా ! 56

కలుగున్ జీవులచావు పుట్టుకలు తత్తర్మాను సారంబుగాఁ
దెలియన్ గష్ట సుఖంబు లన్నియును దద్దేహాత్మభావంబునన్
మలఁగున్ జన్మపరంపరల్ నినుఁ దలంపన్ జ్ఞాన దీప్తుల్ ప్రకా
శిల, చేజెర్ల పురాధివాస ! పరమేష్ఠీ ! శ్రీ కపోతేశ్వరా ! 57

### మహేశ్వరుని విశ్వేశ్వరత్వము

పరమాణుప్రకరంబు, పర్వతము, దీపంబుల్ తమోవ్రాతమున్
గిరులున్ నిర్ఝరులున్ నదీనదములున్ క్షేత్రంబులున్ దీర్థముల్
విరులున్ బెన్దరులున్ వనంబులు కనన్ విశ్వంబు నీవే మహే
శ్వర ! చేజెర్ల పురాధివాస ! త్రిదివేశా ! శ్రీ కపోతేశ్వరా ! 58

పరికింపన్ బహు వృక్ష పత్ర ఫల పుష్పంబుల్ లతానీకముల్
కరులున్, గాఱెనుపోతులున్, బులులు, సింగంబుల్ తురంగాదులున్
ధరయున్, నీరును, నిప్పు, గాలియుఁ, దదాధారంబు సర్వంబు, నీ
సిరి, చేజెర్ల పురాధివాస ! ప్రణవశ్రీ ! శ్రీ కపోతేశ్వరా ! 59

గమనం బాగమనంబుగా నఖిల లోక వ్యాపకం బైన ప్రా
ణమె, చిద్రూపము, దీపమై వెలుఁగులీనన్, జీఁకటుల్ మాసిపో
వ, మహాతేజము గోచరించు నదె దేవా ! నీదు హంస స్వరూ
పము, చేజెర్ల పురాధివాస ! హృదిదీపా ! శ్రీ కపోతేశ్వరా ! 48

శ్రవణానందమునిచ్చు, నిర్భర మనశ్శాంతిన్ బ్రసాదించు, లో
క విశిష్టంబవు సత్త్వమున్ బెనుచు, సంస్కారంబు దీపించుచున్
వివిధంబై విలసిల్లునాద, మెద, సంవిద్రూపు నిన్దెల్పు, ని
ర్భవ ! చేజెర్ల పురాధివాస ! యవికారా ! శ్రీ కపోతేశ్వరా ! 49

పగలున్, రేలును, వారముల్, నెలలు, నాపై వత్సరంబుల్, గతిం
పఁగ, నంతంత యుగంబులై చను గణింపన్, నిన్నుఁ గాలాత్ముఁగా
నిగమంబాగమ, మార్ష వాఙ్మయము వర్ణించున్ 'మహాదేవ' ! ని
ర్యుగ, చేజెర్ల పురాధివాస ! జితమన్యూ ! శ్రీ కపోతేశ్వరా ! 50

## మహిమానువర్ణనము

శిలలోఁగప్పను, గర్భమందు శిశువున్ జీవింపఁగాఁజేయు, నీ
వలనన్ సాధ్యము కానిదెద్ది ? సకల బ్రహ్మాండ భాండంబులన్
వెలయన్ జేయుచు, లీలలన్ నెఱపుచున్, వింతల్ ప్రదర్శింతు, వ
ర్శిలి, చేజెర్ల పురాధివాస ! వరవర్ణీ ! శ్రీ కపోతేశ్వరా ! 51

నిను దర్శించినఁ బాపముల్ దొలఁగు, సందేహంబులున్ దీఱు, జీ
వన సౌఖ్యంబు లభించు, దుఃఖతమముల్ వాయంగ, వాంఛల్ ఫలిం
చును, దైన్యంబు నశించు, సంపద తలిర్చున్ మోక్ష సామ్రాజ్యమ
బ్బును, చేజెర్ల పురాధివాస ! పరశంభూ ! శ్రీ కపోతేశ్వరా ! 52

నినుఁబ్రార్థించిన దుఃఖముల్ దలఁగుఁ దండ్రీ ! నీదు నామంబుఁ బ
ల్కినఁ బుణ్యంబులు వర్ధిలున్, గుణములన్ గీర్తించి, నిన్నున్ స్మరిం
చినఁ బాపౌఘములున్ గతించు, నినుఁబూజింపన్ సమస్తంబుఁగ
ల్గును, చేజెర్ల పురాధివాస ! నెలతాల్పూ ! శ్రీ కపోతేశ్వరా ! 53



తమముంబాపి, వెలుంగుఁ జూపుము, మహాత్మా ! మృత్యువుండ్రోచి, నా
కమృతత్వంబిడుమా, యసత్యమును బాయంజేసి సత్యమ్ముఁగూ
ర్పుము, నీ పాదములంటి మ్రొక్కెదఁ గృపాపూర్ణుండవై నన్నుఁబ్రో
వుము, చేజెర్లపురాధివాస ! పరశంభూ ! శ్రీ కపోతేశ్వరా ! 6

అమృతుండక్షరుఁడైనవాఁడు శివుఁడంచామ్నాయముల్ చెప్పఁగా
'నమ' యంచున్ నినుఁగొల్చు భక్తులకనంతంబైన, యైశ్వర్యమి
చ్చు, మహేశా ! పరమర్షి గమ్యమగు నీజ్యోతిస్స్వరూపంబుఁజూ
పుము, చేజెర్ల పురాధివాస ! వరశంభూ ! శ్రీ కపోతేశ్వరా ! 7

పరిపూర్ణంబు, సచేతనంబు, నఖిలవ్యాప్తంబు, సర్వోత్తమం
బురుతేజోసదనంబు, శాశ్వతము, బ్రహ్మోపేంద్ర సంస్తుత్యమున్
పరమంబున్ బరమార్థ బోధఘటనాభాష్యంబు నీతత్త్వమీ
శ్వర ! చేజెర్ల పురాధివాస ! పరమేశా ! శ్రీ కపోతేశ్వరా ! 8

రవితేజంబున నుండు తీక్ష్ణతయుఁ, జంద్రజ్యోత్స్న యందుండు శై
త్యవిశేషంబును నీప్రభావమె, జగత్సత్త్వంబు నీయందు సం
భవమై భాసిలు, లీనమై చను, దయాపాంగంబులన్ జూచి, కా
వవె, చేజెర్ల పురాధివాస ! సురసేవ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 9

వరమాల్యాభరణాంబరాదికముపై వ్యామోహమున్ వీడి, శాం
త రసస్ఫూర్తి హృదంతరాళమున, నాత్మజ్యోతి దర్శించుచున్
దిరమై, భక్తజనాళి కార్తిహరమై దీపించు, నిన్నే భజిం
తుర, చేజెర్ల పురాధివాస ! గుణసింధూ ! శ్రీ కపోతేశ్వరా ! 10

ఘన పాపౌఘములన్ క్షయింపఁగ, భవద్ధ్యానంబెచాలున్, విశి
ష్టునిఁ బోషింపఁగ, నీవిభూతియె తనర్చున్, శాంతిఁజేకూర్చ, స
త్త్వ నివిష్టంబగు నీ స్వభావ మమరున్ భద్రమ్ములందిమ్ము ఖ్యా
తిని, చేజెర్ల పురాధివాస ! శుభమూర్తీ ! శ్రీ కపోతేశ్వరా ! 11

అమలోదాత్తము నీచరిత్రము, శుభం బానందమున్ గూర్చు, శ్రీ
భ్రమరాంబాసహితుండవై, విబుధసంభావ్యుండవై, భక్తబృం
దము సేవల్గొని, భుక్తిముక్తులిడు, స్వాత్మారాము ని న్గొల్తు ని
త్యము, చేజెర్ల పురాధివాస ! మహిమాఢ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 12

నిను దర్శించుటె కంటికిన్ ఫలము, నిన్గీర్తించుటే వాక్కు క
ల్గిన దానన్ ఫలితంబు, నిన్దలఁచుటే క్లేశాపహం, బో మహా
త్మ ! నినున్గొల్చుటె కాలు సేతులకు సార్థక్యంబు, సర్వాత్మ చే
తన ! చేజర్ల పురాధివాస ! మునివంద్యా ! శ్రీ కపోతేశ్వరా ! 13

నినుఁ గొల్వందల పోయ, నీ చరితము న్గీర్తింపఁగా బుణ్యహీ
నునకేరీతిని శక్యమౌ, సుజనబంధూ ! లోకసంరక్షకా !
ముని సంపూజితపాద పద్మయుగళా ! బుద్ధి ప్రసన్నా ! శుభా
నన! చేజెర్ల పురాధివాస ! వృషయానా ! శ్రీ కపోతేశ్వరా ! 14

కరుణాశీలివి, కాలకాలుఁడవు, భక్తవ్రాతమున్ బ్రోచి, స
ద్వరముల్ గూర్చి, యఘమ్ముఁద్రోచి, పరమార్థంబున్ బ్రసాదించి, సం
సరణాబ్ధిన్ దరియింపఁజేయు పరమౌజశ్శాలివౌ దీవు, దే
వర ! చేజెర్ల పురాధివాస ! బుధసేవ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 15

సుఖదుఃఖంబులు, మిత్ర శత్రుగుణముల్, శూరత్వ భీరుత్వ మి
ట్లఖిలద్వంద్వములన్ సృజించి, త్రిజగం, బవ్యాహతిన్ గూర్తు వో
మఖవిధ్వంసి ! గజాసురాంతక ! మహామంత్రాక్షర ప్రస్తుతో
న్ముఖ ! చేజెర్ల పురాధివాస ! జయశంభూ ! శ్రీ కపోతేశ్వరా ! 16

అనయంబున్ జతనంబుతో మది నినున్ ధ్యానింతు దేవా ! సనా
తనమై శాశ్వతమైన నీ మహిమ, మత్యంత ప్రభావంబు క
ల్గినదై మాటలకున్ మనంబునకు విశ్లేషింపఁగా రానిదై
మను; చేజెర్ల పురాధివాస ! శుభధామా ! శ్రీ కపోతేశ్వరా ! 17



భవుఁడా! రుద్రుఁడ ! శర్వుఁడా ! పశుపతీ ! భద్రాకృతీ ! సోముఁడా !
శివుఁడా ! సాంబుఁడ ! తామ్రుఁడా ! గణపతీ ! జ్యేష్ఠుండ ! శ్రేష్ఠుండ ! భీ
మ ! విరూపాక్షుఁడ ! విశ్వరూపుఁడ ! జగన్మాన్యుండ ! శంభుండ ! కా
వవె, చేజెర్ల పురాధివాస ! నతదేవా ! శ్రీ కపోతేశ్వరా ! 42

జయమున్ మంగళముల్ ఘటించు ఘనుఁడీ శర్వుండు సాంబుండనన్
దయతోఁ బాశుపతంబుఁ బార్థునకు మోదంబొప్పఁగా నిచ్చి యా
శయముల్ దీఱ జగద్విజేతగఁ బ్రతిష్ఠన్ గూర్చి, రక్షించు న
వ్యయ ! చేజెర్ల పురాధివాస ! సుశరణ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 43

## స్వరూప వర్ణనము

[1]జలజాతాసన, మాత్మనిష్ఠయుఁదపశ్శాంతంబుఁ బంచాననం
బులు, సర్వాయుధముల్, త్రినేత్రములు, సంమోదంబుఁ గావించు క్రొ
న్నెలపుష్పంబు, మనోహరాభరణముల్ నీరూపమున్ దెల్పు ని
చ్చలు, చేజెర్ల పురాధివాస ! జగదీశా ! శ్రీ కపోతేశ్వరా ! 44

కరిచార్మాంబరమున్ ధరించి సిగపై గంగన్ శశిన్ బూన్చి కం
ధర మందున్ గరళంబుఁదాలిచి, త్రినేత్రంబుల్ ప్రకాశింప, శం
కర నామంబు వహించి, నాగము నలంకారంబుగాఁగొన్న, సుం
దర ! చేజెర్ల పురాధివాస ! గిరజార్థా ! శ్రీ కపోతేశ్వరా ! 45

గణ నాథుండు వినాయకుండు తను విఘ్నంబుల్ నివారింపఁగా
రణ ధీరుండు, కుమారుఁడాశ్రితుల సంరక్షింప సేనానిగా
నణిమాద్యష్టవిభూతులిచ్చుసతి నీకర్థాంగిగా, హంగుగాఁ
బ్రణుతింపం బడు, దేవదేవ ! జయ భద్రా ! శ్రీ కపోతేశ్వరా ! 46

శుభమౌ నాదము, సాహితీపదము నీ స్తోత్రప్రణీతంబులే,
సభయున్ సభ్యులు, తత్సభాపతియు నీశా ! నీ స్వరూపంబులే,
యిభచర్మాంబర ! నాగహారవలయా ! యిష్టార్థ సంపత్ప్రదా !
ప్రభు ! చేజెర్ల పురాధివాస ! హృతపాపా ! శ్రీ కపోతేశ్వరా ! 47



1పద్మాసనము

మునివృత్తిన్ దపమాచరించు నిను సంమోహింపఁగాఁజేయ, నీ
కనులన్ నిప్పలు రాల్చి మన్మథుని నీఱ్గావించి, తత్పత్ని, ప్రా
ర్థన మన్నించి, యనంగుఁగా, మనసిజున్ రక్షించు కారుణ్యమున్
గను, చేజెర్ల పురాధివాస ! సుమనస్కా ! శ్రీకపోతేశ్వరా ! 36

పటు నృత్యంబు ముగించి, ఢక్క బది యాపై నాల్గు పర్యాయముల్
స్ఫుట నాదంబు ధ్వనింపఁజేయ, ముని, యా ప్రోతల్ విమర్శించి, యు
త్కట మౌ వ్యాకరణంబు సూత్రములుగాఁగన్ జేసి, బోధించె నం
తట, చేజెర్ల పురాధివాస ! నుతవిద్యా ! శ్రీకపోతేశ్వరా ! 37

స్థిరమై శాశ్వతమైనదాని, ననువర్తింపన్, శుభంబౌను గా
న, రసానందుని నిన్నజించిన మహానాగంబు నిర్భీతి, నా
గరుడిన్ సేమము పృచ్ఛసేయు నెలమిన్, గారుణ్య మూర్తీ ! శుభం
కర ! చేజెర్ల పురాధివాస ! శ్రిత రక్షా ! శ్రీకపోతేశ్వరా ! 38

రవి చంద్రానల లోచనా ! రసమయా ! రాజత్కృపాసాగరా!
భవతాపజ్వర హారి ! ముక్తి పద సౌభాగ్య ప్రదాతా ! మహో
త్సవ సంధాయక ! పుణ్య పాపఫలదా ! సారస్వతాధీశ ! చూ
డవె, చేజెర్ల పురాధివాస ! శితికంఠా ! శ్రీకపోతేశ్వరా ! 39

బలిమిన్ బట్టగఁ జేరవచ్చి, యముఁడున్ బాశంబుతోఁగట్టినన్
గలఁతన్‌జెంది, నినున్ మదిందలఁచు మార్కండేయు రక్షించి, భ
క్తులఁబ్రోవం బిరుదైన దైవముగ సంస్తుత్యుండవైతో మహా
బల ! చేజెర్ల పురాధివాస ! ముని సేవ్యా ! శ్రీకపోతేశ్వరా ! 40

నదులున్ సంద్రముఁజేరుకైవడి ననన్తంబైన శబ్దార్థ సం
పద, బ్రహ్మంబవు నిన్నుఁజేరి, పరతత్త్వంబున్ బ్రబోధించు, స
త్య దయా శాంతి, శుభంబులన్ బెనుచు దివ్యజ్యోతియైవెల్గు నా
మది, చేజెర్ల పురాధివాస ! ప్రణవాత్మా ! శ్రీకపోతేశ్వరా ! 41



పతితుల్ పావనులౌట నిక్కము నినున్ భావించినన్ భక్తితో
స్మృతిహీనుల్ మతిమంతులౌదురు, నినున్ సేవించినన్ శ్రద్ధతో
నతిదీనుల్ ధనవంతులౌదురు జపధ్యానార్చనాసక్తులు
న్నతి, చేజెర్ల పురాధివాస ! బుధవంద్యా ! శ్రీ కపోతేశ్వరా ! 18

భువనామోదముఁగూర్చు తావక పదంబుల్ నామదిన్ జేర్చి, సం
స్తవమున్ జేసెదఁ, గ్రోధ, లోభ, మద మాత్సర్యంబులన్ ద్రుంచి, వా
స్తవమున్ జూపు, ప్రశస్తమైన పథమున్ సంధించి, మమ్మోము, మో
శివ! చేజెర్ల పురాధివాస ! కరుణాశ్రీ ! శ్రీ కపోతేశ్వరా ! 19

మును పుట్టించెడివేళఁగర్తవు, జగంబున్ నాశ మొందించు వే
ళను సంహర్తవు, సానురాగమతివై లాలించి, పాలించు వే
ళను, విశ్వంబున కెల్ల భర్తవయి, లీలల్ పెక్కుఁగావుంతువెం
దును, చేజెర్ల పురాధివాస ! శ్రిత బంధూ ! శ్రీ కపోతేశ్వరా ! 20

శ్రుతి సారంబు, సమంత్రకంబు, శుభమౌ, రుద్రానువాకంబు, నే
మతిమంతుల్ పఠియించి నిల్గొలుతు రంభః పుష్పపత్రంబులన్
సతమాయుశ్శత, పుత్ర మిత్ర ధన మా సత్కర్ములన్ జేరు నా
దృతి, చేజెర్ల పురాధివాస ! హితవర్తీ ! శ్రీ కపోతేశ్వరా ! 21

అకలంకం, బఖిలాశ్రితాభయద, మవ్యాజంబు, విజ్ఞానదా
యకమైనట్టి భవత్కృపాలవము, నాయందున్ బ్రసారింపవే,
సకలైశ్వర్య నిధానమై శుభదమై సౌఖ్యావహంబైన పూ
నిక, చేజెర్ల పురాధివాస ! గురుమౌనీ ! శ్రీ కపోతేశ్వరా ! 22

బహుజన్మంబులఁజేయు కర్మఫలముల్ బంధంబులై వెంటరా,
నిహ సౌఖ్యంబుల కాసఁజేసి, కుజనుం డేనాఁడు స్వామీ ! శుభా
వహమౌ, నీ శివనామ సంస్మరణమున్ బాటింపఁడెందున్, దమో
పహ ! చేజెర్ల పురాధివాస ! స్థిరభావా ! శ్రీ కపోతేశ్వరా ! 23

శ్రుతులున్ శాస్త్రములనున్ బురాణములు నిన్ స్తోత్రంబుఁజేయున్, మహా
మతివై, విద్యల కాధిపత్యము వహింపన్, సర్వభూతాంతరం
గ తమస్తోమము రూపు మాపి, వెలుఁగుల్ కల్పింపఁగాఁ జాలు, దు
న్నతి, చేజెర్ల పురాధివాస ! సురవంద్యా ! శ్రీ కపోతేశ్వరా ! 24

అల బ్రహ్మాదుల కందరాని మహిమం బైశ్వర్యమున్ గల్గి ని
చ్చలు, నింద్రాదుల పూజలందుకొనుచున్, సర్వేశ్వరత్వంబు భా
సిల భక్తాళి ననుగ్రహించి, పరిరక్షింపన్ బ్రవర్తింతు వు
జ్జ్వల ! చేజెర్ల పురాధివాస ! జగదీశా ! శ్రీ కపోతేశ్వరా ! 25

విరతిన్ దుశ్చరితంబులన్ విడిచి, నిన్‌విశ్వేశు సేవింపఁ, గా
తర భావంబుఁదొలంగు, శాంతి కలుగున్ ధర్మస్వరూపా ! దయా
కర ! ప్రజ్ఞాన నిధీ ! సుధీ వినుత ! నీ కైలాసమున్ జేర్చు మీ
శ్వర ! చేజెర్ల పురాధివాస ! సురపూజ్యా ! శ్రీ కపోతేశ్వరా ! 26

అనఘంబౌపనిషత్ ప్రసిద్ధమగు బ్రహ్మంబున్ నినున్‌గొల్చి, దుః
ఖ నివృత్తిం గని రాత్మవేత్తలు బుధుల్, కల్యాణ సంపన్నిధీ !
నిను నిత్యంబు భజించు భాగ్యమొసఁగన్ దీనుండనై వేఁడుకొం
దును, చేజెర్ల పురాధివాస ! రస సింధూ ! శ్రీ కపోతేశ్వరా ! 27

విధిముఖ్యామర సేవ్య ! వైద్యనిపుణా ! విజ్ఞాన తేజంబునన్
బ్రథమంబై వెలుగొందుదైవమగు నిన్ బ్రార్థింతు నెల్లప్పుడున్
వ్యధలన్ మాన్పుచు లోక రక్షణముఁగూర్పంజాలు విద్యాతపో
నిధి ! చేజెర్ల పురాధివాస ! నుతమౌనీ ! శ్రీ కపోతేశ్వరా ! 28

యవలున్ వ్రీహులు గోధుమల్ పెసలు, ధాన్యంబుల్ తిలల్ మాషముల్
భవనంబుల్ ధన పుత్ర మిత్ర వనముల్ బాంధవ్యముల్ భాగ్యముల్
గవులున్ క్షీరములున్ దధిన్ ఘృతము సంకల్పింపు మీశా ! భవో
ద్భవ ! చేజెర్ల పురాధివాస ! వరదాతా ! శ్రీ కపోతేశ్వరా ! 29



## పౌరాణిక కథాకథనము

ధనువై మేరునగంబు, శంకర ! జయాస్త్రంబై మహావిష్ణు, విం
కను, జ్యావల్లియు శేషుఁడై, శరధిగా నయ్యబ్ధి, యానంబుఁగా
గను విశ్వంభర, నీకు నా త్రిపురముల్‌గాల్పంగనయ్యెన్, శ్రితా
వన ! చేజెర్ల పురాధివాస ! జయభావా ! శ్రీ కపోతేశ్వరా ! 30

త్రిపురంబుల్ హరియించి, రక్కసుల దోర్వీర్యంబు వారించి, దే
వ పదంబున్ బదిలంబుఁజేసి, విబుధవ్రాతంబు రక్షించున
ట్టి పరంధాముని భక్తిఁగొల్తు నినుఁ, గంతేకాలునిన్, దేవతా
ధిప ! చేజెర్ల పురాధివాస ! చిరకీర్తీ ! శ్రీ కపోతేశ్వరా ! 31

అమృతోత్పాదనకై సురాసురులు క్షీరాంభోధిఁ జిల్కన్, బ్రమా
దముగాఁబుట్టెను గాలకూట మొక డద్దానం, భయభ్రాంతులై
యమరుల్ వేఁడ, దయార్ద్రబుద్ధిని గళంబందున్ నిబంధించిలో
కముఁ గాపాడవె, నీలకంఠ ! సురరక్షా ! శ్రీ కపోతేశ్వరా ! 32

పితరుల్ ముక్తులుగా, భగీరథుఁడు, నిన్వేఁడంగ, గంగాప్రవే
గ తరంగంబులు నీశిరంబున, నలంకారంబుగాఁదాల్చి, సం
తతమున్, లోక హితంబుగా, నతి పవిత్రంబైన తద్గంగ, ని
చ్చితి, చేజెర్ల పురాధివాస ! సుమన శ్రీ ! శ్రీ కపోతేశ్వరా ! 33

భవనంబుల్, భువనంబులున్‌గడచి, విశ్వంబెల్ల నిండన్, మహా
శివలింగాకృతిఁగాంచి, విస్మయమునన్ శ్రీనాథ వాజ్నాథులున్
స్తవముల్ సేసిరి నీదు వైభవము, ప్రజ్ఞానైకవేద్యా ! యుమా
ధవ ! చేజెర్ల పురాధివాస ! శుభగాత్రా ! శ్రీ కపోతేశ్వరా ! 34

కవచంబున్, ధనువున్ ధరించి, సురరక్షం బూని, యుగ్రుండవై
జవసత్త్వంబులు గల్గు బాణముల, రక్షఃపాళి నిర్జించు, బా
హువులన్ గొల్తు, శుభంబు, సౌఖ్యమును, సద్యోగంబు సిద్ధింపఁ జే
యవె, చేజెర్ల పురాధివాస ! బుధవంద్యా ! శ్రీ కపోతేశ్వరా ! 35